# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

*[Part II—Proceedings other than Questions and Answers]*

## OFFICIAL REPORT

---

*Thirteenth Day of the Sixth Session of the*
*Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Monday, the 11th November,* 1957.

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## ELECTION OF A MEMBER TO THE ZONAL RAILWAY USERS' CONSULTATIVE COMMITTEE OF THE SOUTH EASTERN RAILWAY

మిస్టర్ స్పీకర్ ఇవాళ Zonal Railway Users' Consultative Committee of the South Eastern Railway కి ఒక సభ్యుని ఎన్నుకోవలసి ఉన్నది ఇందుకు శ్రీ కె పున్నయ్యగారు, శ్రీ అల్లు ఎరుకునాయుడుగారు నామినేషనలు దాఖలు చేశారు. ఐతే శ్రీ ఎరుకునాయుడుగారు తమ అభ్యర్థిత్వాన్ని విత్‌డ్రా చేసుకొన్నారు ఒక గడువులోగా వదలుకోవాలన్నది ఏమీ లేదు కనుక ఎప్పుడు వదలుకున్నా అంగీకరించడానికి నాకు అధికార మున్నది కాబట్టి అంగీకరించాను. శ్రీ పున్నయ్యగారు ఎన్నుకొనబడినట్లు

మీకందరకు ఇదివరకే నోటీసు పంపబడినది శ్రీ పున్నయ్యగారు దీనికి ఏక గ్రీవంగా ఎన్నుకొనబడినారని సభవారికి మనవిచేస్తున్నాను

## THE ANDHRA DOWRY PROHIBITION BILL 1955

*[ Mr Deputy Speaker in the chair ]*

*శ్రీ ఎస్. సి శేషాద్రి (రాయదుర్గం) అధ్యక్షా ! ఈ డౌరీ ప్రొహిబిషన్ బిల్లుపై జరిగిన చర్చలో అందరు ఒక విషయంలో ఒకే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు ఈ వరకట్నం అనేది చాలా కాలంనుంచి మన దేశంలో సోషల్ ఈవిల్‌గా వుందనే విషయంలో ఎవరికి అభిప్రాయ భేదాలు వుండ జాలవు, వుండకూడదని నేను భావిస్తున్నాను ఎసెంబ్లీ ప్రాంగణములోను, శాసన సభ్యుల వసతిగృహమువద్ద చాలా మంది కన్యాదాతలు, పెండ్లి కావలసిన కన్యలు శాసన సభలో ఈ వరకట్న నిషేధ బిల్లు పాస్‌చేసి కన్యాదాతల, కన్యల కష్టములను తొలగించమని అభ్యర్థించటంజరిగింది కాని, మనం అనుకొన్న ఉద్దేశ్యం ఈబిల్లువల్ల నెరవేరుతుందా? లేదా? అనే అనుమానం ప్రతిఒక్కరిలోను కల్గుతోంది ఎన్నో విధాలైన social legislations ఇదివరకు మనం తీసుకు రావటం జరిగింది Prohibition ను introduce చేయాలని అనుకొన్న రోజుల్లో ప్రతి ఒక్కరు ఎంత ఆసక్తితో, ఆతురతతో ఈ prohibition తీసుకు రావాలని, అది తీసుకువస్తేనేగాని సామాన్య ప్రజానీకం బాగుపడరని, దేశం బాగుపడదని చెప్పారు. అయితే ఆ రోజు prohibition వుండాలని ఎవరైతే మాట్లాడారో వారే ఈనాడు prohibition spoil అయింది కనుక తీసివేయండి అని చెప్పటం మనం ఈ శాసనసభలో వింటూనే వున్నాము సంఘములో ఒక సంస్కరణను తీసుకు రావటానికి ఏవిధమైన చట్టమును అమలులోనికి తీసుకు వచ్చినప్పటికి, ఆ చట్టమును అమలు పరిచేవారి సంపూర్ణ సహకారమువుంటే కాని అది successful measure గా చెలామణి కావటంలేదనే విషయం మనకు స్పష్టంగా తెలుస్తోంది. Prohibition fail కావటానికికూడా యిదే ముఖ్యకారణం ఆ రోజు prohibition తీసుకు రావాలి, అమలు పర్చాలి అని చెప్పినవారంతా కూడా దానిపై శ్రద్ధ చూపుతుండా, చట్టం సరిగా అమలు జరుగుతోందా ? లేదా అని చూడకుండా [illegible] prohibition fail కావటానికి కారణమని నేను భావిస్తున్నాను.

ఈరోజు ఈసభలో pass చేయబోతున్న ఈ వరకట్న నిషేధబిల్లుపై కూడా అదే అభిప్రాయంకలిగి వున్నట్లయితే ఇది ఇక్కడ pass చేయకుండా ఉంచటం మంచిదేమోనని నేను భావిస్తున్నాను వరకట్న నిషేధాన్ని అమలులోనికి తీసుకురావాలని భావించటమే కాకుండా ఆ భావాలను, భావాలుగా వుంచుకోకుండా, కార్యరూపంలోనికి తీసుకువస్తేనే అది successful measure అవుతుందని తమద్వారా సభ్యులకు తెలియజేస్తున్నాను ఈ వరకట్న నిషేధ బిల్లుకు సంబంధించి 'డౌరి' అనే పదముయొక్క నిర్వచనము "Dowry means any property or valuable security given or agreed to be given to one party to a marriage to any other person on behalf of such party " అని వుంది ఇది చాలా narrow గా వుంది కాబట్టి ఏమి ఇచ్చినప్పటికి dowry క్రింద treat చేసినట్లయితే actual working లో మనం చాలా చిక్కులకు, కష్టాలకు గురికావలసి వస్తుందేమోనని నేను అనుకొంటున్నాను

పెళ్ళిళ్ళలో కన్యాదానం అనే ఆచారంఉన్నది కన్యను దానంగా యిచ్చినప్పుడు ఆ కన్య property గా పరిగణింపబడుతుందా, లేదా అనే విషయాన్నికూడా ఆలోచించవలసి యున్నది ఆ విధంగా consider చేయకపోయినప్పటికీ కన్యపైన పెట్టిన సొమ్ము property గా వస్తుందేమోనని సందేహంగా ఉన్నది ఈ రోజులలో పెళ్ళిళ్ళు చేసేటప్పుడు సాలంకృత కన్యాదానం చేసే ఆచారం ఉన్నది మామూలుగా బిడ్డపైనవుండే ఆపేక్షతోగాని, మమతతోగాని వస్తువులుపెట్టి కన్యను దానంచేయడం సంభవిస్తోంది కాని మనం interpret చేసేటప్పుడు సాలంకృత కన్యాదానం అనేది సొత్తుగా పరిగణింప బడకపోయినప్పటికీ, పెట్టిన సొమ్ములు dowry గా పరిగణింప బడతాయేమోననే అనుమానం యీ బిల్లువల్ల ఉదయిస్తోంది Dowry అనే దానికి నిర్వచనం యింకా విస్తృతం చేసినట్లయితే బాగుంటుందని అనుకొంటున్నాను. ఏదో రు. 300, 400 లకే పరిమితి పెట్టి, అది మించినట్లయితే, అది dowry గా పరిగణింపబడుతుంది అని లేకపోతే dowry అనే విషయాన్ని యింకా స్పష్టం చేసినట్లయితే బాగుంటుందని నేను భావిస్తున్నాను Dowry అనేదానికి explanation కి సుందరయ్యగారు ఒక amendment యిచ్చారు.

"Add the following as new Explanation at the end of Clause 3 (a)—

'*Explanation* II: Any property or valuable security given to the bride either at the time of marriage or before or after

by any person and registered in her name shall not be considerd as dowry' అని

ఈ amendment ను కొంచెం consider చేసి ఈ బిల్లులో పొందుపరిస్తే బాగుంటుందని నేను భావిస్తున్నాను సొమ్ము సంబంధమైన ఇచ్చుకోడం, పుచ్చుకోడం వగైరాలను legalise చేసినట్లుగా ఉంటుంది సాధారణంగా సొత్తులు పెట్టకుండా ఏ పెండ్లికూడా జరగడానికి వీలులేదు కాబట్టి యీ amendment చాలా సమంజసంగా వుందనీ, దీనిని ఆమోదిస్తే కొంత యిబ్బంది తీరుతుందని నేను భావిస్తున్నాను అంతేకాకుండా పెళ్లిలో మంగళసూత్రం కట్టే ఆచారం మనకు ఉన్నది పెండ్లి కుమారుడు పెండ్లి కుమార్తెకు మంగళసూత్రం కడతాడు, కాబట్టి అది property గా పరిగణింపబడుతుందేమో అనే అనుమానం కల్గుతోంది 300 రు॥ లు అనిగాని, 400 రు అనిగాని యిందులో ఏమీ పరిమితి పెట్టలేదు కేవలం మంగళసూత్రం కూడా కట్టడానికి వీలులేని పరిస్థితికి వస్తున్నామేమో అనే అనుమానం ఈనాడు ఈ బిల్లు చూడడంవల్ల కలుగుతున్నది అందువల్ల 'మంగళసూత్రం' ఇబ్బందికూడా లేకుండా ఈ amendment ను ఆమోదించినట్లయితే బాగుంటుంది Valuable security అనేదానికి explanation లో Indian Penal Code, Section 35 లో ఉన్న పద్ధతిని అనుసరించేందుకు యిందులో provision చూపించారు అది కేవలం cheque లకు, Promissory note లకు, కాగితాలకే సంబంధించి ఉన్నది మంగళసూత్రం, సొమ్ములు విషయానికి ఏమాత్రంకూడా అవి సంబంధించిలేదు మొన్నటి సోమవారమే మనం యీ బిల్లుపై చర్చించాము దీనిని బహుశా పేపర్లలో చూచివాడు కాబోలు, మద్రాసునుంచి నా మిత్రుడు జాబు వ్రాశాడు 'కట్నం తీసుకోకూడదని ఒక బిల్లు తేబోతున్నారు, చాలా సంతోషం, కాని యిదివరకు చేసుకొన్న agreements ప్రకారం—' మీ అమ్మాయికి యింత సొమ్ము పెడితేగాని పెళ్ళి చేసుకోడానికి వీలులేదని నిర్బంధం చేయడం జరుగుతోంది ఇప్పుడు ప్రత్యేకంగా dowry తీసుకొనకపోయినా 'మీ అమ్మాయికి 8, 10 తులాల బంగారం పెడితేగాని పెళ్ళి చేసుకోడానికి వీలులేదని అంటే - ఆ సొత్తు పెట్టినట్లయితే, అప్పుడు మనం Dowry prohibition Bill ను pass చేసినందువల్ల ఏ మాత్రం ప్రయోజనం ఉండదు Open గా dowry అనేది తీసుకోకూడదని నిషేధిస్తున్నాము. అది gifts క్రింద, సొమ్ములక్రింద పోతుంది. కాబట్టి ఈ amendment తో బాటే Explanation II కు కొంత' amount 800, 400 అని పరిమితంచేసి పొందుపరచినట్లయితే సరిపోతుందని మనవి చేస్తున్నాను.

"valuable security given to the bride either at the time of the marriage or before or after.." అని ఉంది. ఇది చాలా vague గా ఉన్నది.

10 లేక 12 శేర్ల బంగారం పెట్టినప్పటికీ కూడా either after or before the marriage అనే విషయం వస్తుంది కాబట్టి యీ amendment ను accept చేసేటప్పుడు దీంట్లో కొంత fixed amount నిర్ణయించి ఆమోదిస్తే బాగుంటుందని నేను అభిప్రాయపడుతున్నాను మనం కేవలం legislation ద్వారానే దానిని succesful గా చేయాలంటే ఎన్ని amendments తెచ్చినా, ఎన్ని సవరణ బిల్లులను pass చేసినా కూడా వీలుపడదు. ఇందులో తప్పించుకోడానికి వీలుంటూనే ఉంటుంది Non-cognizable offence అని చెబుతున్నారు. అది ఒక విధంగా మేలే Cognizable offence గా వుండాలని కొంతమంది సభ్యులు మాట్లాడారు నేను వారి అభిప్రాయాలతో వ్యతిరేకిస్తున్నాను Cognizable offence చేసినట్లయితే, యీ చట్టం ఎవరయితే అమలుచేస్తారో వారిలో కొంత లంచగొండితనం దారితీసినట్లుగా ఉంటుంది. Practical difficulties ను get over కావడానికి ఏవిధమైన ఆస్పదం ఉండదు కాబట్టి యిది కేవలం non-cognizable offence గానే వుండడం మంచిది కాని కేవలం చట్టం పైననే ఆధారపడి 'letter of law' అనుకోకుండా ప్రచారం కూడా అవసరమని నేను భావిస్తున్నాను ఈనాడు బిల్లు పాస్‌చేశాము, వరకట్నాలు ఆగిపోయాయి అని అంతా యింటిలో కూర్చొనే పరస్థితిలేదు ఇంతకుముందు యిన్ని రోజుల నుంచీ ఏవిధంగా ప్రచారం జరిగిందో అదేవిధంగా వరకట్నం తీసుకోకూడదనే ప్రచారం యికముందు కూడా జరిగితే చాలా ఉపయోగిస్తుంది కాని కేవలం యిటువంటి బిల్లుల వల్ల అంత లాభంవుండదేమో అనుకొంటున్నాను సుమారు 30,40సం లనుంచి dowry system ఉన్నది చాలా కాలంనుంచీ ఇది ఉంటున్నది పూర్వం రాజులకాలంలోకూడా తరతరాలనుంచీ-ఇది దురలవాటు అనుకొన్నా ఏమనుకొన్నప్పటికీ కూడా- రాజవంశంలో పెళ్ళి జరిగేటప్పుడు 'రాజలాంఛనాలతో, ధనకనక వస్తువాహనాలతో ఇవ్వాలి' అనే విధానం పరిపాటిగా ఉండినది. అయితే, యిప్పుడు ఆ రాజ్యాలన్నీ పోయాయి 100, 150 సం॥ల క్రిందట dowry చాలా తక్కువగాఉండేది ఎప్పుడయితే సంఘసంస్కర్తలు బయలుదేరి dowry తీసుకోడం మంచిదికాదని ప్రచారం చేయడం ప్రారంభించారో ఆనాటి నుంచి యీనాటివరకూ సుమారు 20, 30 సం॥ల చరిత్ర చూచుకొన్నట్లయితే రోజు రోజుకూ ఈ dowry అనేటటువంటిది ఎక్కువవుతున్నది, కాని తక్కువ కావడంలేదు కేవలం లెజిస్లేషన్‌వల్ల యిది పోతుందనుకోవడం పొరపాటు. Legislation వుండాలి, దానిని బలపరుస్తూ propaganda కూడా జరగాలి. 20 సం॥ల నుంచీ dowry మరీ ఎక్కువకావడానికి కొన్ని ప్రత్యేక కారణాలున్నాయి 30 సం॥ల క్రిందట వుండే జనసంఖ్యను చూస్తే, ఆ రోజులలో స్త్రీలు తక్కువగా ఉండేవారు పురుషులు ఎక్కువగా ఉండేవారు. ఈనాటి పరిస్థితులను చూస్తే స్త్రీలు పురుషులకంటె ఎక్కువగానున్నట్లు, లేదా ఇద్దరి

జనసంఖ్య సమానంగానున్నట్లు తెలుస్తోంది కాబట్టి ఈ రోజుల్లో element of competition లేదు పూర్వకాలంలో కన్యలు తక్కువగా వుండేవారు, కాబట్టి వరకట్నం అంత హెచ్చుగాలేదు అప్పుడు కన్యాశుల్కం మొదలైన దురాచారాలు ఉండేవి ఇప్పుడు కేవలం Dowry Prohibition Bill కాకుండా మరొక legislation కూడా తీసుకురావడం ఉచితంగా ఉంటుందని నేను భావిస్తున్నాను

ఇప్పుడు మనం భూసంస్కరణలు తేవాలనుకొంటున్నాము ఇప్పుడు పెద్దపెద్ద భూస్వాములు తగ్గిపోయారు ఇదివరకు పెద్దపెద్ద భూస్వాములున్నప్పుడు 5, 10, 20 ఎకరాల మాగాణిభూమిని కట్నంక్రింద యివ్వడం జరుగుతూ ఉండేది అయితే యిప్పుడు మనం ఒక క్రొత్త evil ను confirm చేస్తున్నాము. Educated un-employment జాస్తి అవుతున్న యీ రోజులలో M B B S కూ B. E కు seats దొరికితేసరి, 5, 10, 20 వేల రూ॥ల కట్నం యిచ్చే పరిస్థితులున్నాయి ఈ legislation సక్రమంగా అమలు జరగాలంటే దీంట్లో ప్రభుత్వం బాధ్యతకూడా కొంత ఉన్నది

ఎడ్యుకేటెడ్ అనెంప్లాయిమెంట్ సాల్వ్ అయినప్పుడే వరకట్నం అనేటటువంటిది కూడా సాల్వ్ అయిపోతుంది. అన్ని వర్గాలలోని వారికి కూడ ఒక విధమైన ఆర్థిక సమానత్వం వచ్చినపుడే ఈ వరకట్నముల సమస్య సాల్వ్ అవుతుంది. ఈ నాడు ఏ విధమైన లెజిస్లేషన్ లేకుండా, ఏవిధమైన ప్రచారం లేకుండా ఈ వరకట్న నిషేధము సక్రమముగా అమలు కావడానికి ప్రతికూలాలు ఉన్నాయి. అంతేకాకుండా ఈ నాడు యేమంటే ద్విగామీ బిల్లు అనగా బహుభార్యా నిషేధ చట్టంకూడా యిపుడు అమలులో వుంది. ఈ బహుభార్యా నిషేధ చట్టం, ఇపుడు మనం పాస్ చేసేటటువంటి లెజిస్లేషన్‌కు కొంత ప్రతిబంధకముగా వుండేమోనని నేను భావిస్తున్నాను. కాబట్టి దీనికి సపోర్టింగ్ లెజిస్లేషన్ వుంటే కాని మనము దీనిని సక్రమంగా అమలు చేయలేం, మనం భూసంస్కరణలను తీసుకువద్దామని అనుకున్నాము. భూసంస్కరణలను తీసుకువచ్చి ఒక ఆర్థిక సమానత్వాన్ని స్థాపించగలిగినట్లయితే కొంతవరకైనా వరకట్నము అనేదానిని మనం నివారించగలుగుతాము. కాబట్టి ఇక్కడ వుండేటటువంటి సభ్యులకు నేను మనవి చేసేదేమంటే, ఇక్కడ మనమేదో బిల్లును పాస్ చేస్తున్నాము, వరకట్నాలు [illegible] జరిగిపోతున్నాయి అని కాకుండా ఇక్కడ [illegible] దీనిని ఒక ప్రోగ్రామ్‌గా [illegible] అనుకోకుండా, [illegible] 10, [illegible] [illegible]

మీరంతా వదలుకోవలసి యున్నది' అనేటటువంటి విషయాన్ని మనమంతా ప్రచారం చేయాలి, ఆచరణలో పెట్టాలి ఈ విధంగా చేయడంవల్ల మనం ఈ లెజిస్లేషన్‌కు సపోర్ట్ యిచ్చినట్లుగా వుంటుందనే విషయాన్ని మన సభ్యులందరి దృష్టికి తీసుకువస్తున్నాను అంతే కాకుండా ఒక నైతికమైనటువంటి మార్పు కూడా మనలో ఈ రోజు రావలసియున్నది మనం మన యొక్క పూర్వ చరిత్రను చూసుకున్నట్లయితే ఈ 20, 30 సంవత్సరాల లోపల మన నైతిక బలము తగ్గుతూ వచ్చింది మనం నైతికంగాను, భౌతికంగాను కూడా పతనమైపోతున్నటువంటి రోజులివి కాబట్టి కేవలం ఇటువంటి ఒక లెజిస్లేషన్ ద్వారానే కాకుండా సామాన్య ప్రజానీకంలో వుండేటటువంటి నైతిక శక్తులను ప్రేరేపింపచేసేటువంటి స్పిరిట్యువల్ లీడర్‌షిప్ ఇపుడు మనకు కావలసియున్నదని నేను భావిస్తున్నాను ఈ స్పిరిట్యువల్ లీడర్‌షిప్ అనేటటువంటిది వచ్చి ఈ వరకట్నమనే సాంఘిక దురాచారమునకు మనం దోహదం ఇవ్వకూడదనే విషయాన్ని ప్రతి ఒక్క మానవుడూ అర్థంచేసుకొన్నపుడే మనం ఈ రోజు చేస్తున్న లెజిస్లేషన్ సక్రమంగా అమలు జరుగుతుంది ఆ విధంగా ఒక వరకట్న నిషేధం కానివ్వండి, ప్రొహిబిషన్ కానివ్వండి, ఏ ఇతర సాంఘిక సంస్కరణ కానివ్వండి, ఏమి కావలసినప్పటికీ కూడా మనలో ఉన్నటువంటి నైతికబలాన్ని పెంపొందింప చేసుకుంటేనే యివన్నీకూడా సాధ్యమవుతాయి కాబట్టి రాజకీయాలలో ప్రవేశించడం విడచిపెట్టి చాలామంది ఈ స్పిరిట్యువల్ లీడర్‌షిప్‌ను డెవలప్ చేసుకోడానికి ప్రయత్నిస్తారని, ఆధ్యాత్మిక భావాలను పెంపొందింప చేసుకుంటారని నేను ఆశిస్తూ యింతటితో సెలవు తీసుకుంటున్నాను.

*శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం - జనరల్) అధ్యక్షా, స్త్రీజాతి ఎన్నాళ్లనుంచో కలలు కంటున్న శుభ సమయం ఆసన్నమైనదని నేను భావిస్తున్నాను ఈ బిల్లును ప్రవేశపెట్టిన శ్రీ కాశేశ్వరరావు గారికి హృదయపూర్వక ధన్యవాదాలను కూడ నేను అర్పిస్తున్నాను. నిజంగా శ్రీ కాశేశ్వరరావు గారు "Champion of women's cause" అని నేను భావిస్తున్నాను. "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని భగవద్గీతలో ఒక శ్లోకం వుంది. అధర్మం హెచ్చుగా ప్రబలుతూన్నపుడు ధర్మాన్ని సంస్థాపించడానికి భగవంతుడు అప్పుడప్పుడు అవతారం ఎత్తుతాడని చెప్పారు. ఆ విధంగానే ఇపుడు అధర్మం, ఇటువంటి "ఇన్‌జస్టిస్ టు విమెన్" జరుగుతున్నప్పుడు ఈ అధర్మాన్ని అరికట్టడానికి ఆయన మా పాలిటి అవతార పురుషుడని చెప్పుకోడానికి నేను గర్విస్తున్నాను. ఒకోసారి నేను అనుకుంటాను, "నిజంగా మా కొరకు మేము పోట్లాడ వలసిన పనికూడా లేదు, మా తరఫున పోట్లాడడానికి కాశేశ్వరరావుగారు ఉన్నారుకదా అని. నేను ఈ విధంగా ఎన్నోసార్లు నా

హృదయంలో భావిస్తూ ఉంటాను నిజంగా మా కొరకు ఆయన ఎన్నో laws పాస్ కావడానికి కారణమైనారు అది అందరికీ తెలుస్తున్నదే బహు పత్నీ నిరోధక చట్టం ప్రవేశపెట్టి పాస్ చేయించినదాయనేనని, దాని ఫలితాలను మనం విస్మరించరాదని మనవి చేస్తున్నాను పూర్వం ఒక్కొక్క పురుషుడు ఇద్దరు స్త్రీలనుకాని, అంతకంటె ఎక్కువ మందినిగాని వివాహమాడేవాడు ఆ చట్టమును ప్రవేశపెట్టి అమలులో పెట్టిన తరువాత అలాంటి అక్రమం జరుగకుండా చాలవరకు కట్టుబడింది నేడు ఈ బిల్లుకు స్త్రీలందరూ కూడా అనుకూలురే అని చెప్పడానికేమీ సందేహంలేదు ఎందుకంటే ఈ శాసనసభలో ఇంత మంది స్త్రీలున్నారు, వారిలో ఒక స్త్రీకూడా ఈ బిల్లును వ్యతిరేకించిందని చెప్పడానికి వీలులేదు మాలో ఆ ఏకాభిప్రాయం వుంది మేము ఈ బిల్లును మనస్ఫూర్తిగా సమర్థిస్తున్నాము ఇందులో మగపిల్లలను కన్న తల్లులున్నారు మా సోదరి జయలక్ష్మికి నలుగురూ మగపిల్లలే అయినప్పటికీ ఆమె ఈ బిల్లును మనస్ఫూర్తిగా సమర్థిస్తున్నది దీని అర్థమేమిటి? న్యాయంగా మాకు ఈబిల్లును సమర్థించడంవల్ల ఆర్థికంగా చాలా నష్టమే కలుగుతోంది ఎందుకంటే మాకు ఏదో మా సోదరులు, తల్లిదండ్రులు ముట్టచెప్పే డబ్బును మేము తిరస్కరిస్తున్నాము. దీనివల్ల మాకు నష్టమే కలుగుతుంది కాని కేవలం ఆర్థికంగా వుండే నష్టానికంటే, మేము ఇంకొక ఉన్నతమైనటువంటిదానిని ప్రేమిస్తున్నాము. అదే ఆత్మగౌరవం. కేవలం తన డబ్బుకోసం ఆశించి తనను వివాహమాడాలని ఏ స్త్రీ కోరదు. తనను తనకొరకే వివాహమాడాలని ప్రతిస్త్రీ ఎప్పుడూకోరుతుంది. ఒక స్త్రీ విద్యావంతురాలుకావచ్చు, సౌందర్యవతికావచ్చు, ఇంకా ఆమెకు సంగీతం వచ్చి వుండవచ్చు, గొప్పకుటుంబంలోజన్మించినదే కావచ్చు ఇంకా ఎన్నోమంచి మంచి లక్షణాలు ఆమెలో ఉండవచ్చు. కాని ఆమెకు వివాహంమాత్రం కాదు 20 సంవత్సరములు గడచిపోయి ఉంటాయి 21, 22, 23, 24, 25, 30 ఏండ్లు గడచిపోయినా పెండ్లి కాదు ఎందుకు కాదు? ఆమెలో అన్ని గొప్ప తనాలూ ఉన్నాయి. కాని ఆమె తండ్రి వరుడు కోరిన ధనాన్ని యివ్వలేని కారణం వల్ల మాత్రమే ఆమెకు వివాహం కావడంలేదు. ఇది ఎంత హృదయవిదారకమైన విషయమో అర్థంచేసుకోమని మాసోదరులందరిని ప్రార్థిస్తున్నాను ఆమె మనస్సు ఎంత బాధపడుతోందో? తాను విద్యార్థినిగా వుండినపుడు లేక తన జీవితంలో ఊహించుకొని ఉండవచ్చు, "తనను ప్రేమించే భర్త తనకు లభించాలని", కాని కేవలం ధనానికిమాత్రం ప్రాముఖ్యం యిచ్చి తన కొరకే తనను వివాహం చేసుకోవడానికి సిద్ధపడని పురుషుని ఏ స్త్రీ ప్రేమించగలదు? అది ఎప్పటికీ సాధ్యంకాదు. కేవలం ఒక మార్కెటింగ్ లాగా కాని, ఒక బిజినెస్‌గా కాని వివాహం పరిణమించడం చాలా శోచనీయమైనవిషయం. దీనిని అరికట్టడం [illegible] విధి, ధర్మం కూడాను. యువతులకు తమ ఆత్మగౌరవం వల్ల

తరిఫీదును యివ్వడానికి కూడా ఇది ఉపయోగపడుతుందని కూడా నేను భావిస్తున్నాను పబ్లిక్ ఒపీనియన్‌కు దీనిని పంపించాలని కొందరు అన్నారు కాని ఆ విధంగా పబ్లిక్ ఒపీనియన్ కొరకు దీనిని పంపనవసరంలేదు ఎందువల నంటే నూటికి 50 మందికి పైగా స్త్రీలు ఈ బిల్లును అంగీకరిస్తున్నారని చెప్ప డాని కేమీ సందేహంలేదు ఎందుకంటే మేము ఎలెక్షన్‌లలో చేసిన ఉపన్యా సాలలో ఈ వరకట్నని షేధం గురించి వెల్లడించాము దానికి అందరు స్త్రీలూ తమ అంగీకారాన్ని, ఆమోదాన్ని ప్రకటించారు ఆ కారణంగానే ఎన్నడూ బైటికి పోయి ఓట్లు వేయని స్త్రీలు కూడా తమ పూర్వపద్ధతిని విడనాడి మా స్త్రీలు ఎచ్చటెచ్చటైతే నిలబడ్డారో అచ్చటనున్న స్త్రీలందరూ స్త్రీలకే ఓట్లు వేసి ఎక్కువమంది స్త్రీలను గెలిపించారని, దీనినిబట్టి తమకనువైన శాసనాలను వారు చేస్తారనే అభిప్రాయంతోనే వారు ఆవిధంగా చేశారని కూడా నేను భావిస్తున్నాను ఈ వరకట్నము అనే దురాచారాన్ని పోగొట్టుకోవాలని నేను మనవిచేస్తున్నాను ఇంతకు ముందు సోదరులు సుందరయ్యగారు చక్కగా ఎంతో అనువుగా ఎమెండ్‌మెంట్స్‌తో సహా యిస్తూ మాట్లాడినారు. ఇంతకు ముందు మాట్లాడిన శేషాద్రిగారు కూడా తమ ఉపన్యాసంలో ఈ విషయాన్ని విశదీకరించారు మహాత్మాగాంధీ గారు విమెన్ అండ్ సోషల్ ఇన్‌జస్టిస్ అనే పుస్తకంలో తమ అభిప్రాయాన్ని ఈ విధంగా విశదపరచారు "It is shame upon the young men" అసలు కట్నము తీసుకోవడమనేది యువకజాతికే అవమానకరం అని కూడా ఆయన చెప్పారు ఇంకా ఆయన ఈవిధంగా చెప్పారు

"Any young man who makes dowry a condition of marriage discredits his education and his country and dishonours womanhood " అని.

ఇంకా ఆయన అభిప్రాయాలు కొన్ని ఇక్కడ చదివి వినిపిస్తాను..

"A strong public opinion should be created in condemnation of the degrading practice of dowry and young men who soil their fingers with such ill-gotten gold should be ex-communicated from Society." అని

ఒక గౌ॥ సభ్యుడు : ఆయన ఎంతో తీవ్రంగా చెప్పారు ఈ అభిప్రాయాలు మహాత్మగాంధిజీవి ఇంకా వర్ణాంతర వివాహాల్లో ఏమని చెప్పారు? లెజిస్లేషను చేయమని చెప్పారా ?

శ్రీ పి. సుందరయ్య : ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా మాట్లాడకుండా కూర్చున్నారేమి ?

డాక్టరు బి గోపాలరెడ్డి స్పీకరుగారు ఏమన్నా అంటారేమోనని

(నవ్వులు)

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ తరువాత వర్ణాంతర వివాహాల్లో కూడా గాంధిజీ ఎంతో సుముఖత్వాన్ని ప్రకటించారు వర్ణాంతర వివాహాలద్వారా ఈ దురాచారం చాలవరకు అరికట్టవచ్చునని ఆయన ప్రకటించారు

"Parents of girls should not hesitate to travel outside their little castes and provinces to secure true, gallant young men for their daughters The custom of dowry is a heartless one The custom is confined to the middle class who are but a drop in the ocean of Indian humanity Whenever we talk of evil customs, we usually think of middle class The millions living in the villages have their customs and woes of which we have yet but little knowledge This, however, does not mean that one may ignore the dowry evil because it is confined to a comparatively small number of people This system has to go Marriage must cease to be a matter of arrangement made by the parents for money The system is intimately connected with caste So long as the choice is restricted to a few hundred young men or young women of a particular caste, the system will persist, no matter what is said against it. The girls or boys or their parents will have to break the bonds of caste, if the evil is to be eradicated. Then the age for marrying has also to be raised and the girls have to dare to remain spinsters if need be i e, if they do not get a suitable match All this means education of character that will revolutionise the mentality of the youth of the nation

Women must dare defy a custom which is wholly indefensible and repugnant to one's moral sense"

గాంధీజీ వెల్లడించిన దాంట్లో నిజంగా ఆత్మగౌరవం గల స్త్రీ అయితే ఏ వరుడు తన ధనానికి ఆశిస్తాడో అటువంటి వానిని పెళ్ళి చేసుకోడానికే నిరాకరిస్తుంది. ఆ విధంగానే పురుషుడుకూడా ఆత్మగౌరవం గలవాడయితే స్త్రీధనానికి ఆశించడు. నిజంగా స్త్రీలందరు తమకు సరయిన భర్తలు దొరికే వరకు, తమనుండి కట్నాన్ని వాంఛించే వారిని వివాహము చేసుకోకుండా తమ భావాలకు అనువయిన వారినే పెళ్ళిచేసుకోవాలన్న ఆయన అభిప్రాయం చాల చక్కగ ఉన్నది, ఇంకా ఏ తలితండ్రులయితే తమ బిడ్డలకు వివాహము చేయలేకుండా ఉంటారో వారికికూడా ఒక మార్గాన్ని గాంధీజీ సూచించారు.

"The father who is not able to get his daughter married due to want of money, should be pursuaded to refuse to purchase a match for his daughter but choose or let the daughter choose one who would

marry her for love, not for money This means a voluntary extension of the field of choice There should be no artificial divisions creating innumerable little groups which would not intermarry There is no religion in this cruel custom It would not do to plead that individuals cannot make the commencement and that they must wait till the whole society is ripe for the change No reform has ever been brought about except through intrepid individuals breaking down inhuman customs or usages "

తరువాత ఒక కరెస్పాండెంటు గాంధీజీకి వ్రాసిన దానితో కూడా ఆయన ఏకీభవించారు,

If parents were to educate their daughters as they educate their sons so as to enable them to earn an independent living, they would not have to worry themselves over the selection of husbands for their daughters When girls have had the opportunity of developing their minds fairly and are able to support themselves in a dignified manner, they have no difficulty when they are desirous of marrying in being suitably matched What I plead for is training of girls in useful knowledge that would make them fully confident about their ability to face the world and not to feel dependent upon parents or their future husbands I wish this aspect could be emphasised in considering the difficulties of parents having on their hands daughters of marriagable age In some cases, the accomplishment of a girl is itself a hindrance because she is an accomplished girl Naturally, she would need an equally accomplished husband Here it is necessary to break down the highly injurious caste barriers Breaking down the barriers will widen the range of choice and thus in a great measure prevent exactions

తరువాత సింప్లిఫికేషను ఆఫ్ మాచ్ ఇపుడు 800 రూ. ల కన్న ఎక్కువ ప్రెజెంటేషన్సు అవీ ఇవ్వకూడదని చెప్పి మన చట్టంలో ఉంది దానిని గురించి చాలమంది సోదరులు విమర్శించారు ఎందుకంటే ఈ 800 రూ లతో పెళ్ళిళ్ళు ఎట్లా సాధ్యమవుతాయి? కనీసం మిడిల్ క్లాసెస్‌లో చూచినా, కొన్ని వేల రూపాయలైనా అంటే రెండు, మూడు వేలయినా ఖర్చుచేయందే పెళ్ళిళ్ళు చేయడం ఎలా సాధ్యమవుతుంది ? కాబట్టి ఇది చాలా ఇబ్బందులకు దారి తీస్తుందని కూడా వారు చెప్పారు దానికి కూడ గాంధీజీ ఈ విధంగా చెప్పారు

"Not more than Rs 10 should be required for the performance of the religious ceremonial and nothing beyond the ceremonial should

be considered a necessary part of marriage rites In this age of democracy, when the distinction between the rich and the poor, the high and the low is sought to be abolished, it is for the rich to lead the poor to a contented life by exercising self-restraint in all their enjoyments and indulgences Thousands of poor people deprive themselves of necessaries of life for this purpose and burden themselves with debts carrying ruinous rates of interest This waste of national resources can be easily stopped, if the educated youth set their faces against every form of wasteful expenditure"

ఇదే శ్రీ కాశేశ్వరరావుగారు కూడా ఈ బిల్లు చర్చించినపుడు మాట్లాడుతూ వ్యక్తంచేసిన అభిప్రాయం

"As we are striving towards a Socialistic Society, marriages should be simplified." అనికూడా వారు చెప్పారు కాబట్టి ఇంత కొద్ది మొత్తంలో ఎట్లా పెళ్ళిళ్ళు చేసుకోవాలనుకునే దానికికూడా ఇదే సమాధానం. తరువాత ఇంకొక చిన్న విషయాన్నిగురించి కూడా చెబుదామనుకుంటున్నాను. ఏమంటే మన అసెంబ్లీలో కరప్షన్, కరప్షన్ అని ఎన్నోసార్లు చెబుతూ ఉన్నారు అన్ని పక్షాలవారుకూడా కరప్షన్ లేదని చెప్పడానికి సాహసించలేరు. అయితే దానికి బహుశః రూట్ కాజ్ కూడా కొంతవరకు ఇదే కావచ్చును అని నేను అనుకుంటున్నాను. ఎందుకంటే పూర్వపు పరిస్థితులకు, ఇప్పటి పరిస్థితులకు ఎంతో మార్పు కనిపిస్తున్నది పూర్వం cost of living చాలాతక్కువ ఉండేది ఇప్పుడు చాలా పెరిగిపోయింది ఐతే ఇప్పుడు ఉద్యోగస్తుల జీతాలుమాత్రం పెరగలేదు. అటువంటప్పుడు అదే హోదాను మెయిన్‌టైన్ చేస్తూ ఆడపిల్లలున్న తండ్రులు బహుశః ఈటెంప్టేషన్సుకు యీల్డ్ అవుతున్నారని నేను భావిస్తున్నాను ఈవరకట్న నిషేధం అమలు జరిగినట్లయితే కరప్షన్ కొంతవరకు అరికట్టగలమని నేను భావిస్తున్నాను.

ఇక బిల్లును పబ్లిక్ ఒపినియనుకు పంపడం అనే విషయానికి మనం ముఖ్యంగా సాంఘిక దురాచారాన్ని అరికట్టడానికి, దేశాభ్యుదయానికి ముఖ్యమయిన బిల్లును మనం పబ్లిక్ ఒపినియనుకు పంపకుండానే పాస్ చేసుకున్నాం. టాంట్లో ప్రొహిబిషన్ ఒకటి, తరువాత ఏన్షెంటు మాన్యుమెంట్సు రిజర్వేషను అక్టు పబ్లిక్ ఒపినియనుకు పంపకుండానే మనం పాస్ చేసుకున్నాం. తరువాత సతీసహగమనం అనేది, మారేజ్ ఆఫ్ విడోస్, బాన్ ఆన్ చైల్డ్ మారేజ్ వీటన్నింటిని మనం పబ్లిక్ ఒపినియనుకు పంపలేదు. ఆ విధంగానే దీనిని పబ్లిక్ ఒపినియనుకు పంపడం అనవసరమే. కాబట్టి దీనిని అందరు ఏకాభిప్రాయంతో ఆమోదించవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ టి. వి రాఘవులు (కొవ్వూరు - రిజర్వుడు) అధ్యక్షా, ఈ వరకట్న నిషేధ బిల్లును చాలామంది బలపరుస్తూ, యిది మహిళాభ్యుదయానికి, సంఘ సంస్కరణకు దారి తీస్తుందని, చాలా అవసరమని, చెప్పినారు అయితే యిటువంటి శాసనమును చేసేటప్పుడు చాలా విషయాలు మనము ఆలోచించవలసి యున్నది మానవప్రవృత్తి ఈ రోజున ఏ విధముగా ఉన్నది? సాంఘిక విలువలు వేటిమీద ఆధారపడి ఉన్నవి? పిల్లను యిచ్చేటప్పుడు వరునియొక్క సాంప్రదాయం, అందచందాలు, శక్తిసామర్థ్యాలు, విద్య, గుణగణాలు—యివన్నీ పిల్లయొక్క తల్లిదండ్రులు ఆలోచిస్తారు ఇంతేకాదు, అతనికి ఎంతమంది అన్నదమ్ములున్నారో, అతనివంతు ఎంతభూమి వస్తుందో, ఇల్లు, వాకిళ్ళు ఉంటే అతనివంతు ఎంతో, చదువుకుంటే ఏమి ఉద్యోగం చేయగలడో, చేస్తే ఎంతజీతం వస్తుందో, జీతమేకాదు—యింకా పైన ఎంతవస్తుందో—యివన్నీ ఆలోచిస్తారు మనువు సందర్భంలోనే మనువర్తి విషయాలు కూడ ఆలోచిస్తారు. అయితే నేను, కేవలం స్త్రీలపట్ల దురుద్దేశంతో గాని, కించపరచాలనే భావంతో గాని మాట్లాడుటలేదు సాంఘికవిలువలు ఈనాడు కేవలం డబ్బుమీద ఆధారపడి యున్నవి కాళ్ళమీద నడిచి వెళ్ళేవానికంటే కారుమీద వెళ్ళేవాడు ఘనుడు పూరికొంపలో ఉన్నవానికంటె, పది అంతస్తుల మేడపైన ఉన్నవాడు ఘనుడు కేవలం డబ్బే అందం, డబ్బే సాంప్రదాయం, డబ్బే తెలివితేటలు. డబ్బే సర్వస్వము అనే భావం ప్రపంచంలో సర్వత్రా వ్యాపించియున్నది అటువంటప్పుడు యిది కేవలం దురాచారమని, వెంటనే తొలగించాలని మహిళా సభ్యురాండ్రు చాలా నొక్కిచెప్పటం వింటూంటే నాకు ఒకసంగతి జ్ఞాపకం వచ్చింది 'రజ్జు సర్పభ్రాంతి' అని వేదాంతులు మనకు చెపుతూ ఉంటారు ఎవరైనా చీకటిలో పోతున్నప్పుడు కాలిక్రింద తాడుపడితే, పాము కరచిందని భయపడి మంత్రగానిని పిలవమని, ఔషధం వేయమని, చచ్చిపోతున్నానని కేకలుపెట్టే పద్ధతిలా, యిదికూడా ఉన్నది గాంధీగారిని కూడ వారు quote చేశారు గాంధిగారు చాలా సంగతులు చెప్పారు, మన శరీరమే కాకుండా, మన ఆర్జన యితరులకోసం trust property అని చెప్పారు నియమబద్ధమైన, నిరాడంబరమైన జీవితం గడుపుతూ, త్యాగబుద్ధి కలిగియున్నవారికి—"10 లక్షల రూపాయల ఆస్థి కలిగినవాడే అల్లుడు కావాలి" అనేవాంఛ ఎందుకుఉండాలి? అసలు మన ధర్మము ఏమి చెపుతున్నది? 20 సంవత్సరముల పిల్లవానికి తన పిల్లను యిచ్చేటప్పుడు వరునియొక్క కాళ్ళుకడిగి అతను సాక్షాత్తు భగవంతుడని, తన బిడ్డను యిస్తున్నానని, కన్యాదానం చాలా పవిత్రమైనదని, తన జన్మ తరిస్తుందని, బిడ్డద్వారా తన వంశోద్ధరణకు కృషిచేయటానికి వీలౌతుందని నమ్మి వివాహాలు చేస్తున్నారు. అటువంటి సందర్భంలో కేవలం బిడ్డ ముద్దు కొరకు, అలంకారం కొరకు యిచ్చేటటువంటి పద్ధతిని, దురాచారం క్రింద

భావించుట సబబా అని అడుగుతున్నాను అయితే సన్నకారులో యీ వ్యాధి లేదు, ముతకకారులో వచ్చింది ఇది మానసిక జాడ్యం జిల్లాజడ్జీలు అల్లుళ్ళుగా కావాలని కోర్తారు వారు దొరికేవరకు పిల్లలను చదివించటం, చదివించిన కొద్దీ యింకా కొంచెం పైన చదువుకున్నవారు కావాలనుకొనడం న్యాయమే కదా ? అందువల్ల eligibility circle యీ విధంగా తగ్గుతున్నది ఈ వ్యాధి పోవాలంటే గాంధీగారు, వివేకానందులవారు కూడ చెప్పారు వర్ణాంతర వివాహాలు జరగాలన్నారు Matrimonial eligibility circle ను విస్తృతం చేయుటకు, యీ అవరోధాలన్నీ పోవాలన్నారు దీనికి దేశం ఈ రోజున సిద్ధపడుతుందా అని సూటిగా అడుగుతున్నాను. మన పురాణాలు ఏమని చెపుతున్నాయి ? సావిత్రి సత్యవంతుని పెళ్లి చేసుకొనవలెనని కోరింది అప్పుడు నారదుడు సావిత్రిని "రాజ్యభ్రష్టులై అంధులైన తలిదండ్రుల సేవ చేస్తూఉన్న సత్యవంతుని ఏమిచూచి వరించావు ? పేదరికాన్ని ఎందుకు వరిస్తున్నావు ? ఇటువంటి వివాహం ఎందుకు ?" అని అడిగితే "సత్యవంతునే నేను తప్పక పెళ్లిచేసుకుంటాను" అని సావిత్రి చెప్పినది ఇప్పుడుకూడ చదువుసంధ్యలు ఉండి నేను ఫలానా ఎల్లయ్యనో, పుల్లయ్యనో పెళ్ళి చేసుకుంటానంటే, అట్లా కాదని, డబ్బు యిచ్చయినా సరే లఖాధికారిని చేస్తాననో, లేక ఉద్యోగిని, అధికారంలో ఉన్నవానినో చేస్తానని ఎవరైనా తల్లిదండ్రులు అడ్డుపెట్టితే ఈ శాసనం ఉపయోగపడుతుందేమోకాని, యిది పాస్ అయినతరువాత అమలులో ఉండే యిబ్బందుల గురించి ఎక్కువగా చెప్పను 511 సెక్షన్లు I. P C లో ఉన్నవి అందులో రెండు సెక్షన్లక్రింద కేసులురావు- ఒకవేళ వచ్చినా ప్లీడర్లు గెలవరు- (1) లంచం యిచ్చుట పుచ్చుకొనుట, (2) rape అనే సెక్షను క్రింద. యీ రెండు గెలవటం కష్టం మానవ ప్రవృత్తితో కూడిన యిటువంటి కేసులు రుజువు చేయుట ఎంతో కష్టము. కాశేశ్వరరావుగారి బహుభార్యా నిషేధచట్టం ప్యాస్ అయింది ఇది అమలులో ఎట్లాఉన్నదో చూస్తూనేఉన్నాం, రెండు పెళ్ళిళ్ళు జరుగుతూనే ఉన్నాయి. కాపురాలు చేస్తున్నారు కేసులు పెట్టి సమన్లువస్తే పుట్టింటివద్ద వదలి "పెండ్లిచేసుకొనలేదని, ఎవరో గిట్టనివారు తమమీద కేసు పెట్టుతున్నారని" మగవారువచ్చి చెప్పారు. కాబట్టి యిటువంటి చట్టాలు అమలు జరుగుటలో యిబ్బందులున్నాయి "కట్నం యిచ్చాను, బలవంతపెట్టి తీసుకున్నారు" అని పిల్లయొక్క తండ్రి కోర్టుకు వెళ్ళితే అతని బిడ్డయొక్క కాపురం గతి ఏమి కావాలి ? కేసుపెట్టిన తరువాత భర్తవద్దకువెళ్ళి కాపురం చేయగలదా ? కాబట్టి అది బాగా ఆలోచించవలసిన విషయం. ఈ వివాహవ్యవస్థ మనఒక్క దేశంలోనేకాదు అన్ని దేశాలలోను ఉన్నది. శామ్యూల్ బట్లర్ అనే ఆయన "The Way of all flesh" అనే పుస్తకంలో వ్రాశారు. ఇండ్లలో ఆడపిల్లలు ఉంటే చక్కగా ముస్తాబుచేసి తీసుకు

వెళ్ళి బస్ స్టేండ్సు దగ్గర, గార్డెన్సు దగ్గర, టీపార్టీల దగ్గర, నలుగురికంటూ, పెట్టి వివాహాలు ఏర్పాటు చేయటానికి తాపత్రయ పడుతున్నారు వివాహాలు కావడంలేదు, వయస్సు ముదురుతోంది ఈ పరిస్థితులలో వివాహాలు జరుగుట దుర్లభంగా ఉన్నది జరిగినా అవి నిలబడటం అంతకంటె దుర్లభంగా ఉన్నది విడాకుల కోర్టులకు పని ఎక్కువై పంచాయితీ కోర్టులదాకా పోయాయి ఈ గతే మన దేశానికికూడ పట్టబోతుంది

మహమ్మదీయులలో అయితే, ఆడపిల్లలకుకూడ తల్లిదండ్రుల ఆస్తిలో భాగం ఉన్నది మనలో మగబిడ్డలకు మాత్రమే హక్కు ఉన్నది ఆడపిల్లకు లేదు అందుచేత ఆ కొరత తీర్చటానికి ఆడపిల్లలకు ఏదోరకంగా కొంత సొమ్ము ముట్ట చెపుతూంటే, అది దురాచారమని, దానిని అరికట్టాలని, ఒక నేరంక్రింద పరిగణించాలని చెప్పటం, "Self goal" చేసుకొనటం వంటిది Football ఆడుతూ మనగోలు మనమే చేసుకుంటాము ఇదికూడా ఆ రకంగానే కనబడుతోంది

కేంద్ర ప్రభుత్వంవారు స్త్రీలకు ఇతోధికంగా అభివృద్ధి మార్గాలు చూపించటానికి, ఆర్థిక స్వాతంత్ర్యం కలిగించడానికి, పిత్రార్జితములో కూడ భాగం యిప్పించటానికి యోచిస్తున్నారు అటువంటి హక్కులు స్త్రీల అభివృద్ధికి తోడ్పడతాయి అప్పుడు యీ వరకట్న నిషేధ చట్టాలు అక్కరలేదు అంతవరకు ఏదోరూపంగా ఆడపిల్లలకు యిచ్చే సొమ్మును గురించి తల్లిదండ్రులు బాధపడుతున్నారనుకోవడం తప్పు ఈ వరకట్నం అనేది పిశాచంగా, బాధకరంగా ఎప్పుడు తయారవుతుంది? తమ తాహతుకు మించిన కుటుంబములో సంబంధం చేసుకోవాలని అనుకుంటే అప్పుడు అది ఒక పిశాచంగా, బాధాకరంగా తయారవుతుంది తన తలకు మించిన తలపాగా చుట్టుకోవాలంటే బాధగానే ఉంటుంది.

మా పిల్లకు అల్లూరిబాపినీడుగారింట్లోనే సంబంధం చేయాలి అంటే, అల్లూరి బాపినీడుగారింట్లోనే మగపిల్లలు ఉన్నారా? ప్రపంచమంతా గొడ్డు పోయిందా?

పేదవారికి సంబంధించినంతవరకు, వారు జరుపుకొనే వివాహాలు చూస్తే నాకు చాలా సంతోషంగా ఉంటుంది మూడు శేర్ల బియ్యంతో వివాహం జరిగిపోతుంది మూడు శేర్ల బియ్యంతో అనేక వివాహాలు నేను దగ్గరఉండి చేయించాను నేను పది రూపాయలతోటి చిన తిరుపతి వెళ్లి పెళ్ళిచేసుకొని వచ్చాను. భీమడోలు దగ్గర ఉన్న చిన తిరుపతి వెళ్లి పెళ్ళి చేసుకొన్నాను వెళ్లేటప్పుడు నడిచేవెళ్ళాము, వచ్చేటప్పుడూ నడిచేవచ్చాము రెండు బట్టలుమాత్రం కట్టుకొని వెళ్లాను. రు, 6-8-0 గుడిలో ఇవ్వవలసిఉన్నది గనుక, తప్పనిసరిగా ఆ డబ్బు

ఖర్చు అయినది పది రూపాయలకన్నా ఎక్కువడబ్బు ఖర్చు పెట్టలేదు కాబట్టి యీ కట్నాల సమస్య ఎక్కడ వచ్చింది ? డబ్బుకు సంబధించిన వ్యవహారం వచ్చినప్పుడల్లా యీ కట్నం సమస్య వచ్చింది పూర్వం అన్యం పుణ్యం ఎరుగని పిల్లలకు పెళ్లిళ్ళు చేసేవారు. వాళ్ళకు భర్తలుపోతే, వాళ్ళకు పునర్వివాహాలు చేయండని చెప్పటానికి వీరేశలింగం పంతులుగారిలాంటి గొప్ప సంస్కర్త, తన జీవితమంతా ధారపోసి కృషిచేయాల్సి వచ్చింది పెద్ద అగ్రజాతులమని చెప్పు కొనేవారికి, జ్ఞానం ఉన్నటువంటివారికి చెప్పటానికి ఒక పత్రిక కావలసివచ్చింది చిన్న పిల్లలకు పెళ్ళిళ్ళు చేయవద్దని చెప్పటానికి, భర్తలుపోతే వాళ్ళకు పునర్వివాహాలు చేయండని చెప్పటానికి ఒక సంఘసంస్కర్త కావలసివచ్చాడు ఆ విధంగా చెప్పినందుకు సంఘం ఆయనను బహిష్కరించవలసివచ్చింది కాని పేదవారికి ఏమి ఉన్నది ? భర్తపోతే, పిల్లాజల్లా లేకపోతే, పెళ్ళి చేసుకోకపోతే ఆర్థికంగా బ్రతకలేరు చెరి ఒక తవ్వెడో తెచ్చుకుంటేగాని జీవనం గడనదు ఆ లెవెల్‌లో మేరేజ్ అవసరము అవుతుంది కాని, ఆస్తులు నిలబెట్టుకోటానికి వ్యవహారంచేస్తూ, మానవ స్వభావానికి ఉండే లక్షణాల ప్రకారం నడచు కొంటే, ఇది మంచిదికాదని చెప్పటానికి, ఆవిధంగా వారికి నచ్చచెప్పటానికి ఒక సంస్కర్త పుట్టవలసివచ్చింది చదువుకొన్న మూర్ఖులకంటే, చదువులేనివారు అమాయకంగా, నిర్మలంగా, ప్రకృతికి దగ్గరగా, చాలా సౌఖ్యంగా జీవిస్తు న్నారు. అటువంటి సందర్భాలలో వరకట్నాలకు ప్రమేయములేదు కన్యాశుల్కానికి ప్రమేయములేదు ఇదంతా డబ్బుతో ఉంది "ధన మూలమ్ ఇదం జగత్ - తత్ జగత్ భ్రాంతిమూలమ్" అన్నాడు అందుచేత రజ్జు సర్పభ్రాంతిలో నుండి మనం బయట పడటం చాలా అవసరము

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ ఈ నిషేధము వద్దు అనటము కూడ భ్రాంతేకదా ?

శ్రీ టి వి. రాఘవులు నిషేధంవద్దు అనటం భ్రాంతి కాదండి, "భ్రాంతి పడి నిషేధించాలని అనుకొంటున్నారు, తాడుని చూసి, పాము అని భ్రాంతి పడ్డారు; లైటుతో చూడండి; పాములేదు, మాంత్రికుడూ అక్కర్లేదు, అసలు ప్రమాదమేలేదు" అని చెబుతున్నాను

ఈ బిల్లును అమలుపర్చటంలో చాలా ఇబ్బందులు ఉన్నాయి. "నేను ఒక శాసనం చేయించాను, నేను ఒక శాసనాన్ని బలపరుస్తూ మాట్లాడాను, నేను మహిళాభ్యుదయానికి చెబుతున్నాను"—అనేటటువంటివి, కేవలం చౌక [illegible] యీ వేళలో తయారైనందుకు నేను చాలా విచారిస్తున్నాను [illegible] కాకపోయినా, కాళిదాసుగురించి కవిత్వం చెప్పటం; బ్రహ్మ

చెముడుగాఉంటే ఫస్ట్‌క్లాస్ టికెట్ కొని సంగీత కచేరికి వెళ్ళటం - ఇతరులను వంచించటానికే, తనకు చెముడు అని భార్యకు తెలియకుండా చేయటానికే సంగీత కచేరికి వెళ్ళటం - నిరాడంబరంగా చూస్తే, ఇది చాలా తప్పని చెబుతున్నాను మనకు మనం ఆత్మవంచన చేసుకోనక్కరలేదు ఆడబిడ్డలైనా, మగబిడ్డలైనా, ఆ పిల్లలు మనబిడ్డలే నాకు ఒక ఆడపిల్ల, ఒక మగపిల్లవాడు ఉన్నారు వారిద్దరు రెండుకళ్ళు నాకు ఈ కన్ను గొప్పదా, ఆ కన్ను గొప్పదా అని ప్రశ్న వేస్తే, అది తెలివితక్కువ ప్రశ్న అవుతుంది నాకు రెండూ సమానమైన కళ్లు ఒకప్పుడు, వాళ్ళవాళ్ళ తెలివితేటలుబట్టిచూస్తే నాకు నా ఆడపిల్లపైననే అభిమానం ఎక్కువ అయిందేయో అనుకొంటాను కాబట్టి ఇటువంటి బిల్లులు పాస్ చేయనక్కరలేదు వేగన్‌లోడ్స్ ఆఫ్ లెజిస్లేషన్ తయారుచేస్తున్నామని ఒకసారి శాసనసభలో చెప్పటం జరిగింది ఇంత ఎక్కువ మోతాదులో శాసనాలు చేయటం ప్రారంభిస్తే, 'ఊ' అంటే నేరం, 'ఆ' అంటే నేరం అయి, ఇవి అమలు పర్చే విధానం కనబడక కోర్టులలో గందరగోళానికి దారితీస్తాయని చెబుతున్నాను కాబట్టి, ఇటువంటి శాసనం అవసరంలేదని మనవి చేస్తున్నాను ఈ బిల్లువలన మహిళోద్ధరణ జరగదు సరికదా, వారి కింతో, అంతో తల్లిదండ్రులు ఇచ్చే ఆస్తికూడ చేతులారా దక్కకుండా చేసుకొంటున్నారని చెబుతున్నాను కాబట్టి ఆవేశంతో కాకుండా ప్రశాంతంగా ఆలోచించమని, కారుచౌకనినాదాలు పత్రికలలో వడే తాటికాయంత అక్షరాలను మరొకసారి జాగ్రత్తగా నెమరు వేసి చదవమని చెబుతూ యీ బిల్లు అనవసరమని అంటున్నాను నాకు మహిళా సభ్యురాండ్రగురించి ఎంతో గౌరవం, భక్తి ఉన్నది వారియందు విశ్వాసము ఉన్నది నేను మరొకవిధంగా చెప్పలేదని మనవిచేస్తూ, యీ బిల్లును సభవారి ఎదుటనుంచి ఉపసంహారించుకొంటే మంచిదని తెలియజేస్తూ, ఆవిధంగా చేయవలసిందిగా కోరుతూ ముగిస్తున్నాను.

* శ్రీ వి విశ్వేశ్వరరావు (మైలవరం) అధ్యక్షా, యీ బిల్లుమీద చాలా మంది మాట్లాడారు వారిలో ఎక్కువ మంది యీ బిల్లును బలపరుస్తూ మాట్లాడారు కొంతమంది మిత్రులు మాట్లాడుతూ దీనిని ప్రజాభిప్రాయానికి పంపించాలని అన్నారు కొందరు యీ బిల్లు కొన్ని భ్రాంతులను కలుగజేసేదిగా ఉంది అన్నారు. మరికొందరు మాట్లాడుతూ "మనం వాగన్స్ లోడ్ ఆఫ్ లెజిస్లేషన్ చేస్తున్నామని" చెప్పారు నేను యీ బిల్లు ప్రజాభిప్రాయానికి పంపవలసిన అవసరంలేదని అనుకొంటున్నాను ఆంధ్రదేశంలో యీ బిల్లు ఒకసారి ప్రజాభిప్రాయానికి వెళ్లింది ఆంధ్రప్రాంతంలో ఉన్నటువంటి అనేకమంది దీనిని బలపరుస్తూ తీర్మానాలు చేసి పంపించారు ఎవరు ఎన్ని తీర్మానాలు చేసినా, ఎక్కడా యీబిల్లు వద్దుఅని చెప్పలేదు అనేకమంది బహిరంగసభల్లో తీర్మానాలు

చేసి, ప్రజాభిప్రాయం దీనికి అనుకూలంగా ఉందని తెలియజేయటం జరిగింది. ఇది వద్దని చెప్పినవారు నాకు కనుపించటంలేదు కాని ఇక్కడ కొందరు "మనం వాగన్ లోడ్ ఆఫ్ లెజిస్లేషన్ చేస్తున్నా"మని చెబుతున్నారు వారిని ఒక విషయం ఆలోచించాలని కోరుతున్నాను గాలి మీద పన్ను వేస్తున్నాము నీరు మీద పన్ను వేస్తున్నాము అన్నింటికి పన్నుమీద పన్ను వేస్తున్నాము అవన్నీ వాగన్ లోడ్సు ఆఫ్ లెజిస్లేషన్ అవుతున్నాయి వాటిని వద్దు అని చెప్పటానికి ప్రయత్నం చేయటంలేదు "ఏవో కొన్ని సంఘ సంస్కరణలు చేయాలి, వెనుకబడినవారి హక్కులను రక్షించాలి, మనలో ఉన్న సమస్యలను పరిష్కరించాలి"అన్న ఉద్దేశంతో చట్టముచేయటానికి మనము ప్రయత్నిస్తూంటే కొందరు "మనం బరువైన చట్టములు చేస్తున్నాము, లెజిస్లేషన్ పుస్తకాలు ఎక్కువ అవుతున్నాయి" అని విచారపడటం మంచిదికాదని నేను సవినయంగా మనవిచేస్తున్నాను ఈనాడు కేంద్రశాసన సభలో స్త్రీల హక్కుల గురించి హిందూకోడ్ బిల్లును పూర్తిగా పునర్విచారణ చేయాలని ఒక చట్టము ఉన్నది దానిని వెంటనే పూర్తిగా పాస్‌చేయక కాలయాపన జరుపుతూ ఒక్కొక్క అధ్యాయం పాస్‌చేయటం జరుగుతోంది. ఈమధ్య స్త్రీల హక్కులను గురించి కొన్ని విషయాలు వచ్చినవి స్త్రీలకు కూడ ఆస్తిలో కొంతభాగం ఇవ్వాలనే విషయం వచ్చింది. అది ఇంకా పూర్తిగా రాలేదు అది అసంపూర్ణంగా ఉండి పోయింది మన రాష్ట్రశాసనసభలో దానిని సవరించటానికి మార్గములేదు ఇటువంటి చట్టాలు కావాలని, స్త్రీల హక్కులు రక్షింపబడాలని మనం కోరాలి అందుకు చట్టాలుచేయమని మనం కేంద్రాన్ని కోరాలి. కనీసం వ్యవసాయ భూములకైనా స్త్రీలహక్కు ఉండేటట్లు వర్తింపజేయటానికి ప్రయత్నించాలని కోరుతున్నాను. మానవునకు కుమార్తె, కుమారుడు వీరిద్దరు రెండు కళ్ళు అని శ్రీ రాఘవులుగారు చెప్పారు ఒక కంటికి హక్కు ఉన్నది, ఒక కంటికి హక్కులేదు అని చెప్పడం సరైందికాదు కాబట్టి, కుమారుడుతోపాటు కుమార్తెకు కూడ ఆస్తిలో భాగం వచ్చేటట్లు చట్టం తీసుకురావలసి ఉంటుందని చెబుతున్నాను. అందుకొరకు కృషిచేయాలని కోరుతున్నాను అప్పుడు స్త్రీలకు పూర్తిగా ఆర్థిక అవకాశములు ఏర్పడతాయి. వివాహం కాదేమోనని భయ పడవలసిన అవసరం వుండదు కుటుంబాలువిచ్ఛిన్నం కావటానికి వీలుండదు. స్త్రీలకు హక్కులేకుండా పోతుందని భయపడవలసిన అవసరం ఉండదు. స్త్రీలకు ఆస్తిహక్కులు ఏర్పడతాయి కనుక, వారు భయపడవలసిన అవసరం ఉండదు.

[illegible] ఈ వరకట్నము అనేది పై తరగతుల వారిలోనే ఉన్నదని, క్రింది తర గతులలో లేదని అనుకోవడము పొరబాటు. ఇది ఒక జబ్బుగా పైనుంచిక్రిందకు

క్రిందనుంచి పైకి వ్యాపించి యుంటున్నది ఈ వివాహ సందర్భములో వర కట్నము అనేది అందరికీకూడ వ్యాపిస్తున్నది నా ఉద్దేశ్యములో ఇది పైవారి లోనే కాదు, క్రిందివారిలోకూడా ఉన్నది కట్నముమీద ఆశ అందరికీ ఉంటున్నది క్రింది కులముల వారిలో పూర్వము ఏ కొద్దిగానో ఉండేది ఈ మధ్యనే పై తరగతుల వారినిచూచి, క్రింది తరగతుల వారుకూడ యీ దురాచారమును ఎక్కువగా అవలంబిస్తున్నట్లుగా కన్పిస్తున్నది ఎందువల్లనంటే, అందరుకూడ తమ కులంవారితోనే సంబంధము కావాలనేది కాకుండా తమకు మించినవారితోకూడ సంబంధం కలుపుకోవాలని ప్రయత్నము జరుగుతూ ఉంటున్నది పై వారితో ఎప్పుడయితే సంబంధం కుదురుతుందో, అప్పుడు కట్నముకూడా పెద్దదిగానే కోరడముకూడ ఉంటున్నది లేకపోతే సమానస్థాయిలో ఉన్న కుటుంబాలతో సంబంధము చేసుకునేటప్పుడు, కట్నము మరొకరూపంలో తీసుకునేటప్పుడు అది వరునిపేరనే పెట్టాలి అని కోరడము జరుగుతున్నది అలా చేయకపోతే, ఆ సంబంధము వదులుకోవడముకూడ మనము చూస్తూనే ఉన్నాము ఇలాంటి విధానము తక్షణము అరికట్టించవలసిన అవసరము ఎంతో ఉన్నది ఇది చేయాలంటే, చట్టము రూపములోనే నిర్బంధము చేయాలి ఇలాంటి విధానము అరికట్టాలంటే, దీనికి చట్టమే base గా వుంటుంది ఈ దురాచారమువల్ల ఎన్నో కుటుంబాలు కట్నాలు ఇచ్చుటకు ఆస్తిపాస్తులను తాకట్టు పెట్టడమో, లేక అమ్మడమో, దీనివల్ల నాశనము కావడమో జరుగుతున్నది కొన్ని కొన్ని కుటుంబాలు చివరకు తిండికి గూడ జరగని దుర్భర పరిస్థితులలో ఎన్నో ఉన్నవి కొంతమంది యీ బాధలకు భయపడి, ఆడపిల్లలు పుట్టకుండా ఉంటేనే మెరుగు అని బాధపడేవారు కూడ ఉన్నారు అయితే భగవంతుడు ఆడపిల్లలను యిచ్చినందుకు, యీ విధమయిన దురాచారము దేశములో ప్రబలముగ ఉండడము, యిది వారుచేసిన పాపమనే అనిపించుతుంది చట్టరూపములోనయినా సరే, యిది ఒక నిర్బంధముగ పెట్టి, యీ దురాచారమును మాన్పించగలిగితే కుటుంబాలు అన్నీ బాగుగ ఉండగలవనే నా విశ్వాసము ఒక్క చట్టము చేసినంతమాత్రముచేత, యీ దురాచారము పోవడము సంభవమేనని అనుకోవడము పొరపాటు చట్టము అమలులో ఉన్నప్పటికినీ, దీనిని ప్రజలలో ముందు ప్రచారముచేసి యువకులకు, కట్నాలు కోరేవారికి, యిది దురాచారము, నీచము అని నమ్మకము కలుగజేసినప్పుడే, యీ చట్టమువల్ల మనము కొంత ఉపయోగము కలుగజేసినట్లవుతుంది ప్రజలలో విజ్ఞానము కలుగజేయాలి/ ప్రజలకు పోను పోను యిది నీచము అని బోధపడినప్పుడే, కట్నములు కావాలని కోరడము తగ్గిపోతుంది అప్పుడే చట్టము అమలుపరచడము సాధ్యపడుతుంది. ఇలాంటి

చట్టము ఉంటేగాని, కట్నములు తీసుకోవడమనేది దేశములో మాన్పించలేము అనే ఉద్దేశ్యముతోనే యీ చట్టము తీసుకొని రావలసిన అవసరము వచ్చింది ఈ కట్నములు తీసుకునే దురాచారమువల్లనే దేశములో యీనాడు పేదవాడు, భాగ్యవంతుడు అనే distinction ఏర్పడిందని నా విశ్వాసము కట్నములు తీసుకునే దురలవాటు పేదవారిలో లేదని మనతోటి సభ్యులు వీరరాఘవులుగారు చెప్పారుకాని యిది నిజము కాదు పేదవాళ్ళలో ఓలి అని ఉన్నది ఆ రూపములో యీ కట్నములు యివ్వడము పుచ్చుకోవడము జరుగుతున్నది. ఓలి అనేది పురుషులకు, స్త్రీలకుకూడ యివ్వవలసి ఉన్నది (Interruption)

శ్రీ టి. వి. రాఘవులు అది కన్యాశుల్కము

శ్రీ వి. విశ్వేశ్వరరావు అది కన్యాశుల్కము అనండి, మరేమైన అనండి అలాంటి అలవాటుకూడదని నా అభిప్రాయము ఇలా జరగడము నేను కొన్ని పేద కుటుంబాలలో చూచాను ఓలి అని యిచ్చిన తరువాత, అది తీర్చలేని పేదవాళ్ళు పది, ఇరవై సంవత్సరముల దాకకూడ వాళ్ళకు కట్టుబడి ఉన్న కుటుంబములు ఉన్నవి ఇలాంటి ఆచారాలుగూడ పోవాలి వరకట్నము, కన్యాశుల్కము యిలాంటివి ఏ రూపములో జరిగినా, వాటిని ఈ బిల్లు క్రిందకు తెచ్చి, అవి పోయేటట్టు చేయవలసిన అవసరము ఉన్నదని యీనాటి పరిస్థితులనుబట్టి నేను గట్టిగా చెప్పవలసి వస్తున్నది ఈ రెండు దురలవాట్లు దేశములో ఉండడము పేదకుంటుంబములకు నష్టదాయకము. అందువల్ల యివి వెంటనే అదృశ్యమై పోవాలని నేను కోరుతున్నాను. ఇది ఎంత త్వరలో జరిగితే, అంత త్వరలో మనము నిజముగ కుటుంబ గౌరవమును, ప్రతిష్ఠను నిలబెట్టినవారమవుతాము ఒక్కొక్క చోట కట్నము యివ్వలేక, డబ్బు దొరకక బాధపడుతున్న తల్లితండ్రుల క్షోభ చూడలేక, మనస్సుబాధ పెట్టుకునో, వివాహము నిరాకరించో, తప్పని సరిఅయితే ఆత్మహత్యలు చేసుకున్న వధువులను కూడ నేను చూచియున్నాను. ఈ విధముగ జరిగితే ఆ తల్లితండ్రుల బాధ ఎంతగా ఉండునో గుర్తించాలి కాబట్టి కట్నమే యీలాంటి పరిస్థితులకు కారణమవుతూ ఉంటుంది గనుక, ముందు యీ దురలవాటును మనసంఘము లోనుంచి తొలగించవలసిన అవసరము ఉన్నది గనుక, యిక మీదట దీన్ని ప్రజాభిప్రాయమునకు పంపకుండా కాలహరణము చేయకుండా దీన్ని ఇప్పటికిప్పుడే వెంటనే ఆమోదించి చట్టము చేయడము మంచిది. ఈ చట్టమువల్ల నిర్బంధము చేయడము అవుతుందని కొంతమంది సభ్యులు అభిప్రాయపడిచ్చారు. కాని, ఇది నిర్బంధము కాదు, భ్రాంతి పడడము అంతకంటే కాదు. ఇది ముఖ్యంగా పేదకుటుంబాలకు సహాయకారి అగునని నా అభిప్రాయము

ఎక్కడైై ఎవరైన స్త్రీలు పెళ్ళిళ్ళు చేసుకోవాలని అనుకున్నప్పుడు, వారి కయినా ఈ బాధ లేకుండపోతుంది. కట్నము అడగ కూడదు, అడిగితే చట్టం వల్ల యిబ్బంది కలుతుందనే భయమైనా ఏర్పడుతుంది కాబట్టి దీనిని తప్పకుండ వెంటనే ఆమోదించ వలసిందిగా కోరుతూ ముగిస్తున్నాను

శ్రీ కె రాజమల్లు (సిరిపూరు - జనరల్) అధ్యక్షా, ఈరోజు మనము చర్చించుచున్న వరకట్నముల బిల్లు చాలా అవసరమే అయినప్పటికినీ, దీని వల్ల ఏమయినా సహకారము జరుగుతుందా, ప్రయోజనము ఉంటుందా అనే అనుమానము కలుగుతున్నది ఎందుకంటే యిలాంటి బిల్లులను మనము ఎన్నో pass చేశాము కాని అవి మనము అనుకున్నంత లాభకరముగ లేవు మన దేశములో కట్నములు తీసుకోవడము ఎక్కువగ కొన్ని ముఖ్యమైన కులముల వారిలోనే ఉంటున్నది నాకు తెలిసినంతమటుకు నాలుగు, అయిదు, కులము లలో మెండుగ దాదాపు 35%, 40% ప్రజానీకములోనే ఈ కట్నము తీసు కునే పద్ధతి ఉన్నది ఈ నాలుగు అయిదు కులములవారు " the so-called higher caste people, the so-called educated classes " వీరిలో ఎక్కువ మాత్రమే చాలా ప్రబలముగ ఉన్నదని అందరికీ తెలుసు దీనిని ఎవరూ కాదనలేరు నాకు తెలిసినంతమటుకు పేదకుటుంబాలలో ఈ అలవాటు లేనేలేదు ముఖ్యంగా educated classes, వారు ఏజాతికి చెందినవారయినాసరే, వాళ్ళకుమాత్రం కట్నము తీసుకోవాలనే ఆశ ఉంటున్నది కట్నము యిస్తేగాని పెళ్ళి చేసుకో వద్దు అని చెప్పే చిన్న కుటుంబాలు ఉన్నవి నిజానికి పేదవారు ఆర్థికంగా ఎంత వెనుకబడియున్నారో పెద్దకులములవారము అనిపించుకునేవారు, డబ్బు బాగా ఉన్నవారు, నీతిలోను, నాగరికతలోను, culture లోనూ చాలా backward గా ఉంటున్నారు. ఎందువల్లనంటే డబ్బుఉంటే, చదువు ఉంటుంది చదువు ఉంటే luxuries లభ్యమౌతాయి Luxurious life lead చేసే పరిస్థితి ఉంటుంది కనుక వారు ఎప్పుడు చూచినా వివాహముద్వారా డబ్బుకొరకు ఎదురుచూస్తూనే ఉంటారు ముఖ్యంగా మనదేశములోని స్త్రీజాతికి రెండు కారణములవల్ల పెద్ద అన్యాయము జరుగుతున్నది మొదటిది "Dowry" రెండవది "casteism". ఈ రెండింటిలో dowry కంటె casteism చాలా గొప్ప evil. స్త్రీజాతికి ఏ విధముగాను స్వేచ్ఛ అనేది లేదు. స్వేచ్ఛ లేకపోవడము వల్ల వారి తలిదండ్రులు ఆమెకున్న కులములోనే వరుడు దొరకకనో, లేక ఒక వేళ వరుడు దొరికితే కట్నము యివ్వలేకనో యిలాంటి యిబ్బందులు బాధలు పడే కుటుంబాలు ఉన్నవి ఆ విధముగ వివాహముకాకుండా ఉన్న స్త్రీలు, 20, 25 సంవత్సరముల వయస్సుగలవారు కూడా ఉన్నారు అలాంటి వాళ్ళు పెళ్ళిళ్లుకాక ఎన్నో విధములుగ బాధపడుతున్నారు. ముఖ్యంగా పేద

కుటుంబీకులు, యీ విధముగ ఆడపిల్లలు ఉన్నవారు, కట్నములకు భయపడి పెళ్ళిళ్ళు చేయలేక ఎంతో నిరుత్సాహము, నిరసన గలిగినవారుగా ఉంటూన్నప్పుడు, తమ బంధువులుగాని, యితరులుగాని ఆయనకు ఏలాంటిసహాయము చేయకుండ ఆయనను, ఆ కుటుంబములోనివారిని హేళనచేయడముకూడజరుగుతున్నది అలాంటి పరిస్థితులలోకూడ ఏదైనా ఒక అవకాశమువల్ల వరుడు దొరికితే, అప్పుడు కట్నము యివ్వటానికి తండ్రికి డబ్బు దొరకదు వయస్సు మీరిన పిల్లలు యిళ్ళలో ఉండి, అవినీతిపనులకు దిగడముకూడ కద్దు దీనికంతటికి కారణము కట్నమేనని గుర్తించాలి దేశములో ఎంతోమంది పెళ్ళిళ్ళు లేకుండా ఉన్నవారు, అవినీతిపనులు చేస్తూ ఉండో, లేక చదువుకుని ఉద్యోగము చేసుకుంటూనో పొట్టపోసుకునేవాళ్ళు ఎందరినో మనము యీనాడు చూస్తున్నాము డబ్బుఉంటే పెళ్ళి, లేకపోతే మరొక జీవనము పరిపాటిగా కన్పిస్తున్నది. డబ్బులేనివాళ్ళు. మర్యాదస్థులు అయిన తల్లితండ్రుల మనోవ్యాధి యింత అని లెక్కించడానికి వీలుండదు పెళ్ళిళ్ళు కాకుండా అవినీతిపనులకు దిగడమనేది మన సమాజానికి పెద్ద అవమానము, అగౌరవముగ ఉన్నది పెళ్ళిళ్ళు జరిగిపోతూంటే, యిలాంటి అవినీతి పనులను మనము వినజాలము. పెళ్ళిళ్ళు జరగకపోవటానికి కట్నమే కారణము గనుక, దీనిని discourage చేయవలసిందేనని నా అభిప్రాయము. స్త్రీలలో పెళ్ళిళ్ళు కానివారు అవినీతిపనులు చేయకుండా తగిన ఏర్పాటు చేయాలి గాంధీజీ మనకు ఎన్నోపనులు చేయమని చెప్పారు. అందులో ఒక్కటైనను మనము అమలులోనికి పెట్టలేకపోతున్నాము కట్నము కావాలని కోరేవారు స్త్రీకి పురుషుడు కట్నము, పురుషునికి స్త్రీ కట్నము అని అనుకుంటే ఏ యిబ్బంది ఉండదని స్త్రీ, పురుషులు గుర్తించినప్పుడే ఆడపిల్లలను కనినటువంటి తల్లితండ్రులకు యీ కట్నమువల్ల బాధతప్పిపోతుంది. అలాంటి భావములు ప్రజలలో ఏర్పడినప్పుడు యీ శాసనములతో అవసరముండదు ఇప్పుడు యీ శాసనమును ఏర్పాటు చేసినప్పటికినీ, యిది కొంత మేలు కలుగజేస్తే చేయవచ్చు నాలుగు స్తంభములలో ఒక స్తంభము ఎంతవరకు సహాయము చేయగలదో, అంతవరకే యిది సహాయము చేస్తుంది. పూర్తిగా సహాయము చేయలేదు. ప్రజలు కట్నములు తీసుకోకూడదు, యిది చాలా నీచము అని గుర్తించినదాకా, యిలాంటి శాసనములు పనిచేయవు. కొంతమంది శాసనసభ్యులు మాట్లాడుతూ, యీ అపరాధము భగవంతుని మీద మోపుతూ మాట్లాడారు. ప్రజలలో కట్నము తీసుకోవాలని ఉద్దేశ్యము కలిగినప్పుడు భగవంతుడు ఏమిచేస్తాడు? భగవంతుడు కట్నములు తీసుకోమని బోధించుచున్నాడా? ఈదురాచారము మనము పెట్టుకున్నదే. అందువల్ల దీనిని నిందించి ప్రయోజనం లేదు. ఎప్పటికినీ, మనలో **change of heart** కాకపోతే, శాసనములు ఏమీ చేయలేవు. నీతికి నిలబడితేచాలు అని నా ఉద్దే

క్యము శాసనమే అవసరంలేదు మనము ఎంత civilised గా ఉన్నామో ఎంత educated గా ఉన్నామో, అంత uncivilised గా యీ కట్నాల విషయములో ప్రవర్తిస్తున్నాము చిన్న చిన్న జాతులవారు పెళ్ళిళ్ళను 60, 70 రూపాయలతో ముగిస్తున్నారు మన దేశములో Christians వగైరా జాతులవారు ఉన్నారు Christians లో వరుడు, వధువులకు కావలసిలన బట్టలు, ఒక్క Tea Party కి అయ్యేఖర్చు మాత్రము చూచుకుంటారు ఇక భాగ్యవంతుల ఇళ్ళల్లో పెళ్ళిళ్ళు జరిగితే బంగారము కావాలి రూపాయలు కావాలి, మంచి ఖరీదులు గల చీరెలు, పెళ్ళికివచ్చినవారికి బట్టలు, లాంఛనాలు వగైరాలు అన్నీ కావాలి వీటికి ఎంతఖర్చు చేస్తున్నారో చూడండి ఇది ఎట్లాఉన్నదంటే ఒక దూడను ఒక ఆవును కొనుక్కున్నట్లే, పెళ్ళిళ్ళ విషయములో డబ్బుయిచ్చి పురుషుని కొనుక్కున్నట్లే గనుక దూడక్రింద పురుషుని పోల్చిన తప్పులేదు

కాబట్టి ఎక్కువమంది పురుషులే అన్యాయంగా ప్రవర్తిస్తున్నారు స్త్రీలు అమాయికులు పురుషులు అవకాశవాదులు ఎంత చదివినప్పటికీ, ఎంత జీవనోపాధి సమృద్ధిగా కలిగినవారైనప్పటికీ, కట్నాలు తీసుకోవడం మానడంలేదు ఈ హైదరాబాదు నగరంలో ఎన్నో వేలమంది యీడువచ్చి పెళ్లికాని స్త్రీలున్నారు వారు పెళ్ళికాక అవస్థపడుతున్నారు మనముందున్న యీ బిల్లుద్వారానే వారికష్టాలు దూరంకావు ఉన్నత పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ వున్న స్త్రీలంతా సంఘీభావంతో నియమావళిని తయారుచేసుకొని, సంఘాలుగా యేర్పడి వారి అధ్వర్యాన కట్నాలు అవసరంలేకుండా వివాహాలు జరిపిస్తే సమాజంలో మానసిక పరివర్తన వస్తుంది కాని కేవలం యీ బిల్లుద్వారా ఎన్నడూ రాదు. ఈ బిల్లును నేను పూర్తిగా వ్యతిరేకించడంలేదు కాని నేను మొదట్లో చెప్పినట్లు కొంతవరకు సహాయపడుతుంది మనం నైతికంగా ఆలోచించి హృదయపూర్వకంగా కన్యలను కన్నవారి కష్టాలను కడతేర్చాలంటే కనీసం యీ బిల్లుపైన మాట్లాడిన గౌరవసభ్యులందరూ దీనిని అమలులో పెట్టినట్లయితే ఉపయోగం వుంటుందని చెబుతూ ముగిస్తున్నాను

శ్రీమతి జయలక్ష్మీదేవమ్మ (అలంపూర్) అధ్యక్షా, శ్రీ కాశీశ్వరరావు గారు మొట్టమొదట ప్రవేశపెట్టిన యీ బిల్లును నేను బలపరుస్తూ కొన్ని సంగతులు చెప్పుచున్నాను కొన్ని సంవత్సరాలనుండి వుంటూవచ్చిన యీ వరకట్నం స్త్రీలపాలిట పిశాచి యని చెప్పకతప్పదు ఇది ముఖ్యంగా స్త్రీలకు సంబంధించిన విషయమనీ, అందుచేత స్త్రీలే దీనికి ప్రత్యేకంగా ప్రచారం చేయడానికి ఎక్కువగా పూనుకోవాలనీ కొంతమంది సోదరులు చెప్పుచున్నారు. కట్నం యిచ్చేవారు, పుచ్చుకొనేవారు పురుషులే కనుక పురుషులకే ఎక్కువ

సంబంధం గల విషయం కాబట్టి దాని నిర్మూలనమునకు పురుషులే కంకణం కట్టు కొని పూనుకోవాలి దేశం బాగుపడాలంటే స్వార్థంగురించి ఆలోచించకూడదని మనవిచేస్తున్నాను మనం మూడుకోట్ల ప్రజానీకంయొక్క శ్రేయస్సును కోరి యిక్కడ చట్టములను చేయుచున్నాము ప్రతి చట్టముపైనను ప్రజాభి ప్రాయము తీసికొనుటలేదు ఎప్పుడయితే ప్రజలు మనలను ఎన్నుకున్నారో అప్పుడే వారికి మనయందు పూర్తినమ్మకమున్నదనుట రూఢియైన విషయము అందుచేత ప్రజాప్రతినిధులమైన మన మూడువందలమందిమి ఏకగ్రీవంగా యీ చట్టమును ఆమోదించి అమలు జరుపుటకు కృషిచేయాలి ఈ చట్టం ఎంతవరకు అమలులోకి వస్తుందనే సంగతికూడా మనం ఆలోచించాలి ఈ చట్టం రాక ముందు బహిరంగంగా వివాహసమయంలో కట్నం తీసుకోవడం జరిగేది కాని యీ చట్టం వచ్చినతరువాత రహస్యముగా తీసుకుంటారనే సంగతి కూడ ఆలోచించ వలసియున్నది ఇచ్చినవారు పుచ్చుకునేవారు యిరువురూ శాసనం దృష్టిలో నిందితులని ఉన్నందువల్ల లంచగొండితనాన్ని ఏ విధంగా అరికట్టలేక పోతున్నామో అదే విధంగా వరకట్న దురాచారమును అరికట్టుట కూడ కేవలం శాసనం వలన కష్ట సాధ్యము ఇది అందరు స్త్రీ పురుషులకు సంబంధించిన విషయము, సంతానంయొక్క బాధ్యత పురుషులపైనకూడా ఎక్కువగా వుంటుంది కాబట్టి పురుషులుకూడా వరకట్న దురాచార నిర్మూలనకు కృషిచేయాలి ఆడుబిడ్డలను ఎం. బి బి ఎస్ చదివించినా, లాయర్లను చేసినా, ఉన్నతవిద్య గరపినా 20 వేల రూపాయల వరకూ ఖర్చవుతుంది విద్యావతులైన కన్యల వివాహమునకు సైతం విపరీతముగా కట్నము చెల్లించ వలసిన వాస్తవిక పరిస్థితులున్నాయి ఈ వరకట్న దురాచారపిశాచికి గురియైన తల్లిదండ్రుల దురవస్థచూడలేక కొందరు కన్యలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. కట్నాల తీరులు ఈ విధముగా వున్నాయి ! మూడవ ఫారము ప్యాసయిన వరునికి అయిదు వేలు, S S L C. ప్యాసయిన వానికి పదివేలు, ఇంటర్మీడియటు అయిన వానికి 15 వేలు, బి ఎ ప్యాసయినవానికి యిరువది వేలు, ఈ విధముగా వేలము పాడుతున్నారు.

స్థానిక పరిపాలన మంత్రి (శ్రీ కె బ్రహ్మానందరెడ్డి) : ఒక్కొక్క ప్రాంతంలో రేటు ఒక్కొక్క విధముగా వున్నది.

శ్రీమతి జయలక్ష్మీ దేవమ్మ : ఆంధ్రప్రాంతంలో లక్షలమీద రేట్లుండ వచ్చు, తెలంగాణా ప్రాంతము బీదప్రాంతం కావున అంత ఉన్నత స్థానమునకింకను రాలేదు. ఇక్కడ వేలమీదనే వరకట్నపు రేట్లున్నాయి. పదివేల రూపాయలు [illegible] నిర్ణయం అయిపోయింది [illegible]ముందుకట్నం పైసలుచూస్తేనే [illegible] కొండ్లాడుతు ! ఈచట్టం చేసినతర్వాత [illegible]ంగా కట్నాలు

తీసుకునే అవకాశాలున్నాయి స్వాతంత్ర్యం వచ్చినతర్వాత కక్షలు పెరిగినందు వల్ల, కక్షలులేని మానవుడులేడని ఖచ్చితంగా చెబుతున్నాను అటువంటి కక్షలు గలవారు లేనిసాక్ష్యాలను తెచ్చి పగసాధించుకోడానికి కూడా యీ చట్టమువల్ల అవకాశం వుండవచ్చును అటువంటివి జరుగకుండా చూడాలి "స్త్రీలకు స్వాతంత్ర్యము వచ్చింది," "స్త్రీలకు స్వాతంత్ర్యము వచ్చింది," "స్త్రీలకు స్వాతంత్ర్యము వచ్చింది" అని ప్రతివారు అనడమేగాని బజారులో పశువులను కొనుక్కునే విధముగా వరుని కొనుక్కోవలసిన పరిస్థితి నుండి స్త్రీలను తప్పించ లేక పోతున్నారు కొన్ని కుటుంబాలలో కన్యలను కన్న తల్లిదండ్రులు విపరీత మైన కట్నాలను చెల్లించడమెట్లా అనే వ్యధతో మంచమునపడి కృశించి చివరకు మరణించుచున్నారు అటువంటి సంఘటనలు కూడా మనదేశంలో చాలా జరుగుతున్నాయి

స్త్రీలు, పురుషులేకాక బాలబాలికలు కూడా నడుములు కట్టాలి కట్నములు పుచ్చుకొనుట మనదేశములో సరైనపద్ధతికాదు మనము పశువులవలె అమ్ముడుపోరాదుఅనేమాట ప్రతియువకుని హృదయములోను మారుమ్రోగాలి కన్యాశుల్కం వుందని చాలామంది సోదరులు చెప్పారు అది ఇప్పుడు చాలా తక్కువగావుంది 16 రు లకు మించిలేదు కాని వరకట్నం వేలు లక్షలవరకు వున్నది పిల్ల పెద్దదిఅయి, పిల్లవాడు చిన్నవాడైనా డబ్బు కొరకు పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి బహు భార్యా నిషేధపుచట్టం తెచ్చాము రెండోపెళ్ళి చేసు కొంటే ప్రజలకు తెలుస్తుందనే భయంవల్ల ఆ చట్టం అమలులోనికి వచ్చింది చిన్న పిల్లలకు పెండ్లి చేసినప్పటికి ఆ విషయం దాగదనే భయముతో శారదా చట్టం అమలులోనికి వచ్చినది కాని ఈ వరకట్నపు బిల్లు అటువంటిదికాదు దీనిలో రహస్యముగా జరిగే సంఘటనలు వున్నాయి దానికి ప్రతివారి హృద యములు మారాలి ఇంత చదువుచదివాము, ఇంత అభివృద్ధిలోనికి వచ్చాము, కాని మన తల్లిదండ్రులు పశువులను బజారులో వేలంవేసినట్లు మనలను వేస్తు న్నారు, మనం ఆవిధంగా అమ్ముడుపోకూడదు అని ప్రతి యువకుడు భావిం చాలి, అప్పుడు కాని ఈ చట్టము అమలులోనికి రాదు ఈనాడు పురుషుడు తన డిగ్రీతో సమానముగా కట్నములు తీసికొంటున్నాడు వారికాధనం శాశ్వ తంగా వుండబోదు, కాని ఇచ్చేవారు మాత్రం కష్టాలకు గురిఅవుతారు ఈ కట్నముడబ్బేకాక యింకా 10 వేలు అదనంగా ఖర్చుపెట్టవలసి వుంటుంది. దీనివల్ల కొంపలు గుల్లకాక మానవు. అటువంటి పరిస్థితులలో వున్న, కొడుకు లకు ఏమి మిగలదు తల్లిగర్భంనుండి మగవారు, ఆడవారు, అంతాసమానముగా పుట్టారు కనుక వారిద్దరికి ఆస్తిసమానంగా చెందవలసివుంటుంది. కాని ఈకట్నాల వల్ల మగపిల్లలకు ఏమీ మిగులకుండా పోతున్నది కూతురికి ఇచ్చినా తమకు

చెందదేమో అనే భయంలో పిల్లవాడి పేరున ఇవ్వమనికూడా అడుగుతారు కొడుకులకు కట్నం ఇస్తుంటే అమ్మాయిలకు బంగారము పెడుతున్నాముకదా అని కొందరు అంటున్నారు కాని పెట్టిన బంగారము కూడా వారికి వుండటములేదు భర్త చనిపోయిన తరువాత 'స్త్రీధనం' అని దక్కుతుందేమోగాని ఏ స్త్రీకూడా ఈనాడు మెరుగుగల బంగారంలో తులతూగటంలేదని చెబుతున్నాను ఆవిధంగా ఈ కట్నాలవల్ల కుటుంబములు కూలకుండా, చిక్కులకు అవకాశం లేని విధంగా దీనిని అమలు లోనికి తీసుకు రావాలని సభ్యులను ప్రార్థిస్తూ ఇంతటితో సెలవు తీసికొంటున్నాను

మిస్టర్ స్పీకర్ తమపేరును మొదట పిలవలేదని కొందరు ఆతృత, పొందుతున్నారు, కొందరు అపార్థము చేసుకొంటున్నారు గతసారి పేర్లు పంపించినవారిని మొదట పిలచి తరువాత ఈ వేళ పేర్లు పంపించినవారిని పిలుస్తాను పిలచినవారు ఇప్పుడు హాజరు కాకుండిన యెడల వారికి టైంవుంటే చివర అవకాశము ఇవ్వబడును

శ్రీ పి రామాచారి (ధర్మవరం - జనరల్) . ఎంతమంది వున్నారు ?

మిస్టర్ స్పీకర్ చాలా మంది వున్నారు

శ్రీ ఎస్ నారాయణప్ప (గూటి - జనరల్). ఉపాధ్యక్షా, మన శాసన సభాధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు తెచ్చిన ఈ వరకట్న నిషేధ బిల్లును శ్రీమతి అమ్మన్నరాజా ప్రతిపాదించగా శ్రీ లక్ష్మణ్ దాస్ బలపరిచారు దీనిపై చాలామంది సభ్యులు తమ అభిప్రాయాలను వెల్లడించారు. మనదేశ పరిస్థితులను గమనిస్తే ఈ బిల్లును అత్యంత అవసరంగా అమలు జరుపవలసివుంది. చాలామంది సభ్యులాంధ్రులు తమ కన్నబిడ్డల పెండ్లిళ్ల విషయంలో పారుపడే కష్టాలను వివరంగా చెప్పారు, ఎదిగి ఇంట్లోవున్న అమ్మాయిని గౌరవప్రదమైన వంశములోని విజ్ఞానవంతుడైన వరునికి ఇవ్వాలనే ఆశ ఆ పిల్ల తల్లిదండ్రులకు వుంటుంది, ఆ ఆశ ప్రకారం వరాన్వేషణ జరిగినపుడు కట్నం హెచ్చుగా వుండటం ప్రస్తుతం అలవాటుగావుంది, ఎంత విద్యావంతుడయితే ఎన్ని డిగ్రీలు పొందివుంటే ఎంత ఉన్నతఅధికారమును అలంకరించివుంటే అంత ఎక్కువగా కట్నం తీసికోవటం అనేది చాలామందిలో వుందనే విషయం నిర్వివాదాంశము. మంచి సంతానముమీదనే దేశాభివృద్ధి, దేశముయొక్క కీర్తి ప్రతిష్టలు వుంటాయనే సంగతి అందరికి తెలుసు. ఈ కట్నాలవల్ల వచ్చే కష్టాలను ప్రమాదాలను చూపిస్తూ అనేక సినిమాలు ప్రదర్శింపబడ్డాయి. దీనిని చట్టం చేసిన

తర్వాత అమలుపరిచే ప్రయత్నములో ప్రజలు ఎంతవరకు సహకరిస్తారనేది అనుమానాస్పదంగా వుందని చాలామంది గౌరవసభ్యులు చెప్పారు ప్రస్తుతం మద్యపాన నిషేదం అమలులోవుంది ఏదైనా ఇటువంటివాటిని ప్రచారము చేసి, వాటిలోని కష్టనష్టాలను మానవుల మనసులకు హత్తుకొనేటట్లు చేయాలి ఒక వేళ ఎవరైనా చట్టాన్ని ధిక్కరిస్తే నేరంగా పరిగణించి, శిక్షగాని, జరిమానాగాని వేసినా ప్రచారము జరిగితేతప్ప ఇది జయప్రదంగా జరగదని నా అభిప్రాయం ఈ వరకట్నాల చట్టమును ధిక్కరించినఎడల కఠినమైన శిక్షలు జరిమానాలు వేయాలని ఈ బిల్లులో పొందుపరచినా, లోపాయికారిగా ఈ కట్నాలు తీసికొనే ప్రయత్నాలు జరుగుతూనే వుంటాయి, దానికి మానసిక పరివర్తన అత్యంత అవసరం

మానవుడు మానసికంగా మార్పు చెందితేతప్ప యీ చట్టం జయప్రదం అవ్వడానికి అవకాశం లేదు ఈ సదుద్దేశాన్ని ప్రచారశాఖద్వారా అమలు చేసే ప్రయత్నం జరిగితే, దానికి ప్రభుత్వంకూడా సహకరిస్తే దీనిని జయప్రదం చేసే సావకాశమున్నది వరులు తమ మనస్సుకు నచ్చినపిల్లను, మంచియింటి కన్యను పెళ్ళిచేసుకోవాలని ప్రయత్నించి, వరించి పెళ్ళిచేసుకోవడంలో తప్పేమీ లేదు కాని కట్నంఆశించి చేసుకుంటే వారి విజ్ఞానానికీ, పరిణామాలకూ చాలా ప్రమాదమని నేను మీద్వారా మనవిచేస్తున్నాను మనలో 'స్త్రీధనం' అనే ఆచారం ఉన్నది పెండ్లినాడు, శాస్త్రరీతిగా పెండ్లికూతురు పేర పెట్టిన సొమ్ము స్త్రీ ధనంగా పరిగణిస్తున్నాము ఆ కుటుంబంలో ఆర్థికంగా ఎంత ప్రమాద పరిస్థితులు ఏర్పడినప్పటికీ ఆ స్త్రీ ధనాన్ని ఉపయోగించకుండా, జాగ్రత్తగా కాపాడుతూంటారు పూర్వకాలంనుంచీ వచ్చే అలవాటుప్రకారం స్త్రీకి పెట్టిన ధనమును అపేక్షించే అలవాటు మనకు లేదు వివాహ సందర్భంలో పెండ్లి కూతురికి యిచ్చిన ధనం, సొమ్ములు, స్త్రీ ధనంగా పరిగణింపబడుతున్నవి ఈ వరకట్న నిషేధబిల్లు వాటినికూడా నిషేధిస్తోంది వివాహ సందర్భాలలో తలిదండ్రులు కోరి వస్తువులు, యితర ఆభరణాలు యివ్వవచ్చు దానినికూడా యీ బిల్లు నిషేధిస్తోంది అటువంటిదానికి అవకాశం లేకుండాపోతోంది శుభ కార్యాలలో యింతవరకూ యివ్వవచ్చు, యింత విలువగలిగిన సొమ్ములు యివ్వవచ్చు అని ఒక పరిమితి పెట్టాలి. నీతి నిజాయతీలను సంఘములో నెలకొల్పేందుకు యీ వరకట్నాల నిషేధపు బిల్లును అమలుచేసే ప్రయత్నం చేస్తున్నాము. దీనవల్ల దుస్సంఘటనలు ఏర్పడి, దుష్ఫలితాలు కలిగే అవకాశంకూడ లేకపోలేదు వ్యక్తికి కొంతవరకూ అవకాశంకల్గిస్తేతప్ప సాంప్రదాయ సిద్ధాంతాల ప్రకారం వివాహం మొదలయిన శుభకార్యాలు సక్రమంగా, సవ్యంగా జరగడానికి అవకాశాలు ఏర్పడుతాయి. కుటుంబంలో ఎటువంటి ఒడుదుడు

కులు లేక, కష్టాలు, దుఃఖాలు లేకుండా సంసారం సుఖవంతంగా సాగి, దేశములో జరిగే అభివృద్ధి కార్యకలాపాలలో వారుకూడా పాల్గొని దేశాన్నత్యానికి, వికాసానికి తోడ్పడడానికి వీలుపర్పడుతుంది. ఇటువంటి విషయాలన్నింటినీ దృష్టిలో పెట్టుకొని అవసరమైన సవరణలు చేసి ఈ చట్టంలో పొందుపరచినట్లయితే చాలా ఉత్తమంగా ఉంటుందని నా అభిప్రాయం వివాహాలలో 8 విధాలున్నాయి గాంధర్వ వివాహం, రాక్షస వివాహం మొదలైనవి అయితే ఇష్టంతో, కోరికతో కూతురును వరునకు యిచ్చే సాంప్రదాయం ఉన్నది ఈ బిల్లువల్ల కట్నాలను నిషేధించడంద్వారా వచ్చే ప్రమాదాలను తగ్గించడానికి అవకాశం కల్పించినట్లయితే చాలా బాగుంటుందని, ఇటు మహిళా సమాజంవారికీ, అటు పురుష సమాజంవారికీ ఏవిధమైన బేదాభిప్రాయాలు లేకుండా భార్యాభర్తలు తమసంసారాన్ని సవ్యంగా, సుఖవంతంగా నడుపుకోడానికి వీలుంటుందని మనవి చేస్తున్నాను ఈ వరకట్నాల పేరుతో ఎన్నో సంసారాలు కోర్టులకు ఎక్కి అవియిచ్చే తీర్పులకోసం ఎదురు చూచేందుకు గురికాకుండా వుండేవిధంగా ఈ చట్టంద్వారా సత్ఫలితాలు ఇచ్చేందుకై కొన్ని సవరణలు చేయాలి. మానవ సమాజానికీ, మహిళా మండలికీ ఈ వరకట్నాల వల్ల కష్టాలేమీ రాకుండా, సంసారం సవ్యంగా సాగిపోయే పద్ధతిలో ఏర్పాటు చేయాలని మనవిచేస్తూ నేను విరమిస్తున్నాను

శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం - రిజర్వుడు) . అధ్యక్షా, ఈ వరకట్న నిషేధబిల్లును నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను, ఈ వరకట్న నిషేధబిల్లును శాసనసభలో ప్రవేశపెడుతున్నారు, అది వస్తుంది అని మన భారతజాతి స్త్రీలు ఎంతోకాలంనుంచి అనేక విధాలుగా సంతోషిస్తున్నారు. ఇప్పుడు మన అధ్యక్షులైన శ్రీ కాశేశ్వరరావుగారు యిదివరకు దీనిని ప్రవేశపెట్టారు దానిని యిప్పుడు శ్రీమతి అమ్మన్నరాజాగారు ప్రవేశపెట్టారు. శ్రీ లక్ష్మణదాస్‌గారు బలపరిచారు మన 3 కోట్ల జనాభాకు కూడా ఉపయోగించే బ్రహ్మాండమైన బిల్లు యిది దీనివలన మనదేశంలో వుండే స్త్రీ పురుషులంతా కూడా సంతోషిస్తున్నారు ఈ మధ్య మన శాసనసభ్యుల హాస్టలుదగ్గరకు 18 సం॥ల యువకులు, స్త్రీలు కూడా దాదాపు 30 మందిదాకా వచ్చి ప్రతి సభ్యునియింటికీ వెళ్లి ఈ బిల్లును వెంటనే శాసనం చేయాలి, చేయకపోతే మన భారతదేశానికే తీరనినష్టం వస్తుంది అని, వారు చిన్నకుఱ్ఱవాళ్ళు అయినప్పటికీ ఎంతో శ్రమకు ఓర్చి తిరుగుతూ ప్రచారం చేశారు ఇందుకు శాసనసభ్యులంతా చాలా సంతోషించారు. ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపాలని కొంతమంది తెలియజేశారు. శాసనసభ్యులమైన మనం 301 మందిమీ కూడా మన మన నియోజకవర్గాలలో 70 వేల ఓటర్లతో ఖాయినా ఎన్నుకోబడి

యిక్కడకు వచ్చాము మన గ్రామాలలో జరిగే విషయాలను మనం ప్రతినెలా, ప్రతివారం, ప్రతిరోజు కూడా తెలుసుకుంటూ ఉంటాము ఈనాడు ఎంతోడబ్బు ఖర్చుచేసి, తమకున్న భూములను అమ్మి, పిల్లలను B A వరకూ, అంతకంటె ఎక్కువగా కూడా చదివించి చాలా నష్టపోతున్నారు ప్రజలు స్త్రీలుకూడా పెద్దక్లాసులు చదువుకుంటున్నారనుకోండి B A చదివి పట్టభద్రులు అవుతున్నారు పూజ్యులైన మన జవహర్‌లాల్ నెహ్రూగారు "ఆడవారికీ, మగవారికి సమానహక్కులు కలిగించేందుకు ఒక బిల్లును గతసంవత్సరమే తెచ్చారనుకొంటాను

ఆడపిల్లలు మగపిల్లలు తండ్రికి పుట్టినా ఆడపిల్లలకు యిదివరకు ఆస్తిలో హక్కులేకుండా ఉండేది. ఆడపిల్లలకు కూడా సమానమైన హక్కులు కల్గించే ఏర్పాటు మన భారతప్రభుత్వం చేసిందని నేను అనుకొంటున్నాను

అందుచేత ఈ బిల్లు మూలకంగా ఈ వరకట్నమనే పిశాచం మన దేశము నుండి పోతుందని అందరూ సంతోషిస్తున్నారు కొంతమంది ఏదో లోపాయి కారీగా చేశారనుకోండి, ఆ లోపాయికారీగా జరగడం వారికి యిష్టంవుండి చేశారనుకోండి, అది ఒక లెక్కలోకిరాదు కాని ఎవరైనా వివాహమాడేటపుడు వారు కట్నం తీసుకోకుండా చేయడమే మన ధర్మం ఈ విధంగా కట్నాలను ఎవరూ పుచ్చుకోకుండా యిపుడు కాకపోయినా, యింకా కొద్ది రోజులలోనైనా నిషేధించినపుడు తప్పకుండా ఈదురలవాటు అనేది పోతుందని నేను సంపూర్ణంగా నమ్ముతున్నాను మొన్న లక్ష్మణదాసుగారు మాట్లాడుతూ దేశం మొత్తంమీద స్త్రీలవద్ద కొన్ని కోట్ల రూపాయల విలువగల - దాదాపు 4 కోట్ల రూపాయల - బంగారం వుంది. వారి వద్దనున్న బంగారమునంతనూ కూడా స్త్రీలు తగినటువంటి పరిశ్రమలకు, ప్రభుత్వ బ్యాంకులకు మొదలైన సంస్థలకు యిచ్చినట్లయితే దేశం చాలా బాగుపడుతుందని అన్నారు అది చాలా చక్కనైనటువంటి సలహా అని నేను మనవి చేయుచున్నాను అందువల్ల స్త్రీలు. కట్నంలేకుండా వివాహం జరిగినప్పటికీ కూడా 'నాకు 50 తులాల బంగారం వుండాలని కోరకూడదని నేను స్త్రీలందరికీ హృదయపూర్వకంగా మనవి చేస్తున్నాను అలాగే పల్లెగ్రామాలలో జరిగే వివాహాలు చాలా తక్కువ ఖర్చులతో జరిగినప్పటికీ నాకు 10 తులాల బంగారం కావాలి, 15 తులాల బంగారం కావలయుననీ' కోరేటటువంటి వాళ్లు వున్నారు ఆ విధంగా బంగారం స్త్రీ జాతిలో ఎవరూ కూడా కోరకూడదని నేను వారికి వినయపూర్వకంగా మనవి చేయుచున్నాను. స్త్రీలకు ముఖ్యంగా కావలసినవి సరైనటువంటి బట్ట, సరై

నటువంటి తిండి మాత్రమే  కాని వారు బంగారం కావాలి, ఎక్కువగా డబ్బు సంపాదించాలి అంటే మనదేశం ఎప్పుడూ బాగుపడదు  ఎక్కువ కష్టాలను కోరిన దానివల్ల స్త్రీలకు తీరని నష్టం కల్గుతుందనే ఉద్దేశంతోనే ఈ బిల్లును ప్రవేశపెట్టి శాసనంగా చేస్తున్నాము  బంగారాన్ని వంటిన వుంచుకోకుండా, తగిన బట్ట, తగిన వసతి మాత్రమే కావాలని కోరవలయునని మన ఆంధ్ర ప్రదేశ్‌లోని స్త్రీ లందరినీ నేను హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను  పెళ్లిళ్ళు చేసేటపుడు, గ్రామాలలోను, పట్టణాలలోను మందుసామానులకు మొదలైన వాటికి అవసరంగా అనేక వేల రూపాయలను ఖర్చు చేస్తున్నారు  ఆ విధంగా ఎక్కువ డబ్బును అనవసరంగా ఖర్చు చేయకుండా తక్కువ ఖర్చులతో పెళ్లిళ్లు చేసినట్టయితే బాగుంటుందని శాసనసభ్యులు చాలామంది సూచించారు  కాబట్టి గ్రామసంఘాల మూలంగాను, గ్రామ పంచాయితీల మూలంగానూ పెళ్లిళ్ళు చేసినట్లయితే లేక Registered Marriages చేసినట్లయితే ఒక 10 రూపాయల ఖర్చుతో అయిపోయే ఏర్పాటును కూడా ఈ బిల్లులో ప్రభుత్వంవారు చేయవలయునని మనవి చేయుచున్నారు  ఈ బిల్లును ప్రాజాభిప్రాయానికి పంపకుండా. ఇది ఆంధ్రప్రదేశ్‌లోని స్త్రీ పురుషులందదరికీ పనికివచ్చేది కాబట్టి స్త్రీల ఓట్లు ఎక్కువ కాబట్టి త్వరలో పాస్‌చేసి ప్రభుత్వంవారు ప్రజలందరికీ మేలు కలిగేటట్లు చేస్తారని నేను ఆశిస్తున్నాను. ఇంతకుముందే లక్ష్మీకాంతమ్మగారు గాంధీగారు వ్రాసిన విషయములను కొన్నిటిని తమ ద్వారా చెప్పారు  గాంధీగారు వర్ణాంతర వివాహాలు ఎక్కువగా జరగాలని చెపుతూవచ్చారు చాలాకాలంనుండి వర్ణాంతర వివాహాలు జరిపించాలని చాలామంది పెద్దలు అనేకవిధాల ప్రయత్నాలు చేస్తూ ఉన్నారు  కాని వర్ణాంతర వివాహాలు అంత ఎక్కువగా జరగడంలేదు కనీసం కొంతవరకైనా వర్ణాంతర వివాహాలు జరగడానికి వీలుగా ప్రభుత్వంవారు ఈ చట్టంలో ఒక సవరణ కూడా చేయాలని నేను మనవిచేస్తున్నాను  వర్ణాంతర వివాహాలు జరిగినట్లయితే అస్పృశ్యతా, కులతత్వాలు తప్పకుండా పోతాయి  ఇప్పుడు కులతత్వాల వల్లనే మన దేశానికి చాలా నష్టాలు వాటిల్లుతున్నాయని ఆమె చెప్పినారు. ఆ విధంగా ప్రతిరోజూ కులం కులం అనే పద్ధతిపైనే చాలావరకు పోతున్నది. కాబట్టి అలాంటివన్నీ అరికట్టడానికి ఈ బిల్లులోనే కొన్ని సవరణలుచేసి త్వరలోనే ఈ బిల్లును పాస్ చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను  అధ్యక్షులవారికి హృదయపూర్వక అభినందనాలు సమర్పిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ యస్. శ్రీనివాసరావు (తాడేపల్లిగూడెం - రిజర్వుడు): అధ్యక్షా! చాలామంది శాసనసభ్యులు తమ హృదయపూర్వకముగా బలపరచినటువంటి బిల్లును నేనుకూడా హృదయ పూర్వకముగా బలపరుస్తున్నాను. అయితే

ఈలాంటి బిల్లులు విజయవంతంగా సాగాలంటే దానికి కొంతభాగం గోపాలరెడ్డి గారిమీద ఆధారపడి ఉందని నేను భావిస్తున్నాను ఎందుచేతనంటే ఇటువంటి సాంఘిక సంస్కరణలనేవి సక్రమంగా అమలు జరగాలంటే వాటికి ప్రజలలో ప్రచారం కావాలి. అందుకు ధనం కావాలి ఇటువంటి సాంఘిక సంస్కరణలకు జనసమూహంలో బ్రహ్మాండంగా ప్రచారం అవసరమనే విషయం తమకందరికీ తెలిసినవిషయమే రాష్ట్రాలలో కాని, విదేశాల్లో కాని ఏవిధమైన సంస్కరణలు వచ్చినప్పటికి, అవి జనసమూహంలో బ్రహ్మాండంగా ప్రచారం చేయబడతాయి ఈవేళ చైనా, రష్యా, అమెరికా దేశాలలో బ్రహ్మాండమైనటువంటి మార్పులు, సాంఘికమైనటువంటి రాజకీయమైనటువంటిమార్పులు వైజ్ఞానికమైనమార్పులు వస్తున్నవంటే వాటినన్నిటికీ సంబంధించిన literature ను, బజార్లలో paper, printing ఖర్చులు కూడా లేకుండా, అణాకు, అర్ధణాకు వారు అమ్మడం, మనవారు కొనుక్కొని చదవడం మనం చూస్తునే ఉన్నాము కాని, దురదృష్ట వశాత్తు భారతదేశంలో పూర్వం బ్రహ్మాండమైనటువంటి రాజకీయ విప్లవాలు, సాంఘిక విప్లవాలు ఎన్నో జరిగినప్పటికీ కూడా తత్సంబంధ మైనటువంటి చరిత్ర చదవడానికి కాని, కొనుక్కోవడానికి కూడా అవకాశం లేనటువంటి పరిస్థితిలో మనదేశం ఉన్నదని తమ కందరికీ తెలిసున్నదే అందుచేత ఏదైనా ఒక చట్టాన్నికాని, ఇంకేదైనా ఒక దానిని తీసుకువచ్చి ప్రచారంలో పెట్టవలె నంటే దానికి 75 వేల రూపాయలు డబ్బు చాలదు ఇదివరలో కర్నూలులో ఉండగా అక్కడ ప్రచార శాఖకు 75వేల రూపాయలనుమాత్రమే కేటాయించి నట్లున్నారు ప్రచారశాఖను చూసినట్లయితే చాలా బ్రహ్మాండంగా ఉండేది. ఒక Director, Deputy Director, మంత్రులు, పురోహితులు, సామంతులు, కవిగాయకులు, రథ అశ్వ భేరీ తప్పెటాది జనంబులు ఉన్నారు కాని ధనం మాత్రం లేదు. అందుచేత ఇటువంటిదానికి ప్రచారం చాలా అవసరం, ముందు ఆర్థికంగా, ఎక్కువగా ధనం యిచ్చి ప్రచారం చేయించడానికి ప్రయత్నం చేసి నట్లయితే ఈ కార్యక్రమం successful అవుతుందని నేను అభిప్రాయ పడు తున్నాను మన శాసనసభ్యు లందరూ M L A సినిమాను చూసే ఉంటా రనుకుంటాను ఆ సినిమాలో M L A. మాత్రం వివాహ సందర్భంలో ఏమీ Dowry తీసుకున్నట్లుగా ఎక్కడా మనకు స్ఫురించలేదు అయితే కొంతమంది, నిన్న మొన్నటివరకు సుపుత్రులు వారికీ ఉంటే, ఆ పుత్రులకు కావలసినటువంటి కట్నాలన్నీ రాబట్టుకొని పెండ్లిండ్లయిపోయి, మళ్లీ యింకొక పెండ్లి చేయటానికి అవకాశంలేని శాసనసభ్యులు కూడా మరి ఎందుకో Dowry Prohibition Bill ను ఎదిరించుతూ మాట్లాడుతున్నారు ఇది చాలా విచారకరమైన విషయం. వారి కార్యక్రమం అంతా ముగిసిపోయింది వారు కన్నకొడుకు లకు highest amounts వచ్చినవి తరువాత ఏమైనా జనసృష్టి కార్యంకూడా

సాగించడానికి అవకాశం లేనటువంటి పరిస్థితిలో ఉండికూడా ఈ బిల్లును ఎదిరిస్తూ మాట్లాడే శాసనసభ్యులు కొంతమంది ఉండడం దురదృష్టం మన దేశంలో పూర్వం ఎంతో విప్లవం జరిగింది ఈ సాంఘిక విప్లవాన్ని గురించి అహర్నిశలూ, కష్టించినటువంటి కందుకూరి వీరేశలింగం పంతులుగారిలాంటి వారు, తారకంలాంటివారు వివర్ణ వివాహాలు చేసుకున్నటువంటివారు, కులం నుంచి వెలివేయబడ్డవారు జైలుకు వెళ్ళివచ్చినంతమాత్రంచేత వర్ణసంకరమైనారని బాధలు పడినటువంటి దేశంలో కాంగ్రెస్‌వాదిగా ఉండి, శాసనసభ్యుడుగా, బాధ్యత గలవారుగా ఉండి, ఆబిల్లును ఇక్కడ ధైర్యంగా ఎదిరించగలగడమంటే- ఇది కేవలం తమ స్వంత ధనంతోను, బలంతోను ఎదిరించగల్గడం తప్ప విజ్ఞానంతోకాని, ప్రజాబలంతో కాని, లేక పార్టీనియమాలతో కాని అలా ఎదిరించి ఉండలేరని నేను అభిప్రాయ పడుతున్నాను ఇకపోతే ఈ శాసనసభ్యులు, మంత్రులు, ఉద్యోగస్థులు, ఉన్నారు

శ్రీ ప్రగడ కోటయ్య (చీరాల) - అధ్యక్షా, ఈ బిల్లును కాంగ్రెసుపార్టీ తీసుకువచ్చినదా ? వారు, పార్టీనియమాలకు విరుద్ధంగా అని చెప్తున్నారు ఈ బిల్లును Congress Party అంగీకరించిందనా వారిభావం ?

శ్రీ యస్. శ్రీనివాసరావు పార్టీ నిర్ణయించిందని నా అభిప్రాయంకాదు. పార్టీకి ఒక ప్రణాళిక ఉన్నది ఒక కార్యక్రమం ఉన్నది. పార్టీ platform మీద 10, 20 సంవత్సరాలుగా, కొన్ని సంవత్సరముల తరబడి మనం మాట్లాడుతున్నాము. అది open secret ఆ విధంగా పార్టీ, సంస్థ అందరూ బహుళాంగీకారమైన సిద్ధాంతానికి వ్యతిరేకంగా మాట్లాడరని నా భావం. పార్టీ దీనిని అంగీకరించిందో లేదో కోటయ్యగారికి తెలుసు, నాకుకూడా తెలుసు. పోతే శాసనసభ్యులుగా ఉండేవారు, మంత్రులుగా ఉండేవారు, ఉద్యోగస్థులుగా ఉండేవారు ఉన్నారు ప్రతివారు కూడా ఒకరు గతి తార్కిక భౌతికవాద సంబంధమైనటువంటి Socialism గురించి చెప్తుంటే, ఒకరు ఫెబియన్ సోషలిజాన్ని గురించి చెపుతుంటే, ఒకరు Gandhian Socialism గురించి చెప్తుంటే, ఇంకొకరు సోవియట్ సోషలిజాన్ని గురించి చెప్తుంటే, వినోబా భావే గారి Socialism గురించి మరొకరు చెప్తుంటే, వేరొకరు ఉపాయం డిపార్ట్‌మెంట్ సోషలిజాన్నిగురించి చెప్తుంటే, అపాయంలేని ఉపాయం డిపార్ట్‌మెంట్ అందరూ సోషలిజాన్ని గురించే చెప్తున్నారు. మరి యింతమంది సోషలిజాన్ని గురించి మాట్లాడితే ప్రతీ సోషలిస్టు వ్యవస్థలోను కూడా వర్ణరహితమైనటువంటి, వర్గరహితమైనటువంటి సమాజాన్ని సృష్టి చేస్తామని చెప్పే అమాంబాపతు సోషలిస్టులారా అని పిలవవలసి వస్తుంది. ఎవరికివారే, రెడ్డిగారి

యింట్లో రెడ్డిగారు వివాహాలు చేసుకొంటున్నారు శాసనసభ్యుడనైన అదృష్టమో దురదృష్టమో కాని ఈ మధ్య దేశంలో ఎక్కడెక్కడ కొంచెం పెద్ద యింట్లో వివాహం జరుగుతుంటే, ఫలానా, ఫలానా వారికి వివాహం దయచేయవలసినదని చెప్పి మేము వెళ్ళినా, వెళ్ళకపోయినా ఆహ్వానాలు పంపిస్తున్నారు వాటిలో చూస్తే చివర సుశీలారెడ్డిగారి కుమారుడైనటువంటి నాగిరెడ్డిగారికి సుబ్బమ్మారెడ్డిగారిని ఇస్తున్నారనో, ఈ చౌదరమ్మగారి కొడుక్కి ఆ చౌదరమ్మగారి కూతుర్ని యిస్తున్నారనో లేక ఆచారిగారికి ఆచార్యులుగారు కూతురుని యిస్తున్నారనో, ఈ విధంగా ఎప్పుడో మనదేశంలో ఉండబడినటువంటి ఆ నాలుగు వర్ణాశ్రమ ధర్మాల ప్రకారంగా ఉండేటటువంటి, అందులో మళ్ళా గోత్రయుతంగా వారు ఆరువేలవారా, మూడు వేలవారా ? తడిరెడ్డా ? మడిరెడ్డా ? భూమంచిరెడ్డా ? కాపా ? పంటకాపా, కొండకాపా, backward కాపా అనేటటువంటి విధానాలతోనే నేడు వివాహాలన్నిటినీ జరిపేసుకుంటూ వివాహం అన్ని బేనర్లక్రింద, అంటే కాంగ్రెస్ బేనర్లక్రింద, కమ్యూనిస్టు బేనర్లక్రింద, సోషలిస్టు బేనర్లక్రింద, ఫెడరేషను బేనర్లక్రింద జరుగుతోంది అక్కడకు వచ్చేటటువంటి ఆచార్యులలో కొంతమార్పు కనబడుతోంది అసలు బ్రాహ్మణులు కానటువంటివారు కొంతమంది 7 అడుగులు వేస్తే చాలునని, జెండాక్రింద నడిస్తే చాలునని, ప్రమాణం చేస్తే చాలునని ఇలాంటి సూత్రాలు కొన్నిచెప్పి వివాహాలు జరిపిస్తున్నారు. కాని ఈ వివాహాల్లో నూటికి తొంబదితొమ్మిది వివర్ణ, సవర్ణ వివాహాలు కాదు. రెడ్లు రెడ్లనే వివాహం చేసుకోవాలి కాని ఇతరులను చేసుకోరు ఇక్కడ మన కాంగ్రెసు సోదరులున్నారంటే వారు వారే ఈ విధంగా ఎవరికివారే యమునాతీరే అయితే వరకట్నాలు పోయేది ఎట్లా ? కట్నాలు పోవాలంటే నాకు సులువయిన మార్గము ఒకటి కనిపిస్తోంది. ఇక్కడ శాసనసభ్యురాండ్రున్నారు వారికి పుత్రులుగాని, కుమార్తెలుగాని ఉండవచ్చును చక్కగా స్ఫురద్రూపుడుగా ఉండి, చక్కనిభాష మాట్లాడేవాడుగా ఉండి, మంచిసంగీతం, సాహిత్యం నేర్చినవాడుగా ఉండి, ఏదో నాలుగుడబ్బులు స్వతంత్రంగా సంపాదించుకునేవాడుంటే అన్య వర్ణములో ఉండినవానికి వివాహాములు ఎందుకు జరిపించరు ? వాని వర్ణము మీకేమి అడ్డం వచ్చింది ? వాడు కట్నంలేకుండా వివాహము చేసుకుంటాడు ఎందుకు వానికిచ్చి వివాహము చేయకూడదు ? మీరుమాత్రం "మా వేలువిడచిన తోటికోడలుగారి బావమరిది కుమారుడినే వివాహము చేయాలి మా రెడ్డిగారినే చేయాలి" అనడం మానేవరకు ఈ సమస్య ఇలాగే ఉంటుంది. రెడ్లకు డిమాండు ఉంది కాబట్టి, నేను బి ఎ ప్యాసయినాను కాబట్టి నా డిమాండు ఇంత, ఇంతయితేనేగాని నేను దిగను అని ఆ రెడ్డిగారు కొండెక్కి కూర్చుంటున్నాడు కనుక ఇది మారాలి అని చెప్పి శాసనసభ్యురాండ్రందరు,

తత్సంబంధమయిన బంధువర్గమంతా క్రింద చదువుకున్నవారు, సంస్కారం ఉన్నవారు. ప్రస్తుతం ఉన్న ఫారిన్ కల్చర్ లేకపోవచ్చు గాని, భారతదేశానికి సంబంధించినంతవరకు, భారతదేశంలో ఆచార సంబంధాల్లో కలిసి మెలసి తిరగగలిగిన వ్యక్తులు ఏ వర్ణంలో ఉన్నవారైనా సరే వారికి వివాహాములు జరిపించితే యీ కట్నాలసమస్య పోతుంది వర్ణసమస్య లేకుండా కాస్త అంద మయిన అమ్మాయిని ఎవరైనా వివాహము చేసుకోడానికి తయారైతే వాడు డబ్బులేకుండా కొట్టుకొని వెడుతున్నాడు. నేను ఎదురు పదికాసుల బంగారం ఇస్తాను. నగలు పెడతాను అని చెప్పి వివాహాలు చేసుకోవలసిన పరిస్థితులు వస్తున్నాయి అరుంధతిని వశిష్ఠుడు వివాహం చేసుకున్నాడు వశిష్ఠుడు పెద్ద బ్రాహ్మణోత్తముడని, అరుంధతేమో "చండాలప్లవ మాతంగ దివాకీర్తి జనంగమాని ఫాదశ్యః పచావంతే వాపీ చండాల పుల్కసహః" దశనామములు పెట్టినటువంటి మాలవనితనో, మాదిగవనితనో చెప్పితే అపుడు క్రైటేరియన్ ఏమిటి ? దేన్నిబట్టి ఆయను వశిష్ఠుడు వివాహం చేసుకున్నాడు ? ఆమె శీలాన్ని బట్టి, ఆమె అందాన్నిబట్టి వివాహం చేసుకున్నాడు ఆచంద్ర తారార్కంగా శ్రోత్రియ బ్రాహ్మణులంతా ఇష్టం ఉన్నా లేకపోయినా ఆ అరుంధతికి చేతులెత్తి నమస్కారం చేయాలి. అట్లాగే గుణవంతులు, రూపవంతులు అయిన స్త్రీలు గాని, పురుషులుగాని వారు ఏ వర్ణంలో ఉన్నా వారికివివాహాలు చేయడానికి అన్ని రాజకీయ పార్టీలవారు ప్రయత్నించి బ్రహ్మాండమయిన ఉద్యమంగా తయారు చేసినట్లయితే ఇక్కడ ఈ శాసన సభా కార్యక్రమాన్ని మనం ఇంత సేపు చర్చించవలసిన అవసరం ఉండదని నేను అభిప్రాయపడుతున్నాను.

ఇక సంస్కరణాయుతమయిన కొన్ని బిల్లులు మనం ఆంధ్ర ప్రభుత్వంలో చేశాం అందులో ముఖ్యమయినవి మద్యపాన నిషేధం, అస్పృశ్యతా నివారణ, దేవాలయ ప్రవేశం, మొదలయినవి అట్లాగే ఆర్థిక సంబంధమైన బిల్లు కూడా మనం పాస్ చేశాం ఋణనివారణ పరిష్కార చట్టముచేశాం. ఆ ఋణ నివారణ చట్టము కేవలం ఋణం చేసినటువంటివారికి, అప్పులతో బాధపడేవారికి ప్రయోజనకారిగా ఉన్నది తరువాత ఆ ఋణం మేరకు మనం నిర్ణయించిన వడ్డీ మేరకు మరల అప్పులు పుచ్చుకోవడం మొదలయిన సంబంధబాంధవ్యాలు ఆ ఋణదాతలకు, ఋణగ్రస్థులకు మధ్య కలుగుతున్నట్లు మనంతెలుసుకోవాలి. అట్లాగే మద్యపాననిషేధం విషయంలోకూడాను పోతే అస్పృశ్యతా నివారణ విషయంలో మాత్రం నిజంగా నేను ప్రభుత్వాన్ని, అన్ని రాజకీయ పార్టీలవారిని అభినందించాలి. అయితే అభినందిస్తున్నానంటే నూటికి నూరు పాళ్ళు ఆ బిల్లు వచ్చినమూలంగా అస్పృశ్యత నివారణ అయిందనే అభినందనకాదు. కాని ప్రతివారు అస్పృశ్యత నివారణ చేయాలని ప్రయత్నం చేస్తున్నారు. ప్రభుత్వం

కూడా కొన్ని నిధులను ఏర్పాటుచేశారు, హరిజన సేవా సంఘాలు, ఫిలాంత్రపిక్ ఎసోసియేషన్సు, గౌతమీ కారుణ్యసంఘాలు మొదలైనవి అస్పృశ్యతా నివారణకు కృషిచేస్తున్నాయి వారిని అందులకు అభినందించవలసిందే సాంఘిక విప్లవాన్ని తీసుకువచ్చేటటువంటి యీ చట్టానికి కొన్ని నిబంధనలుపెట్టి, యీ చట్టాన్ని ధిక్కరించిన వారికి మరణశిక్షలు వేస్తామనో, చిత్రవధచేస్తామనో అని అన్నందువల్ల ప్రయోజనంలేదు హెచ్చుమంది శాసనసభ్యులు దానిని మేము హృదయపూర్వకంగా బలపరుస్తున్నాము అన్నందువల్లకూడా ప్రయోజనంలేదు ఇది కేవలం నైతిక సంబంధమయిన, దేశంలోఉన్న ప్రజలయొక్క విజ్ఞానానికి సంబంధించిన విషయంగా మనం భావించాలి ఆ రకమయిన ప్రచారము ఎక్కువగా చేయాలి ఇదివరకు ఒకసారి ఆర్థిక మంత్రిగారు, ఇతర మంత్రులు కొంత మంది ఏమయ్యా గోడలమీద పేపర్లు అంటించి, అట్లా, ఇట్లాచేస్తే అవన్నీ పోతాయా—డబ్బు ఖర్చుగాని, అని చెప్పినట్లు నాకు జ్ఞాపకం

*Mr. Deputy Speaker* Let not the hon Membeı address them వారిని అడ్రస్ చేయకండి ఎన్నోసార్లు చెప్పారు మీరు

శ్రీ యన్ శ్రీనివాసరావు నేను ఒక సందర్భంలో అస్పృశ్యతా నివారణమీద మాట్లాడుతూ wall posters బిల్లు రావాలని మాట్లాడినప్పుడు కాగితాలు అంటిస్తే అస్పృశ్యత పోతుందా ? అని అన్నట్లుగుర్తు అది తప్పు అయితే క్షమించండి

కనుక నేను మనవిచేసే దేమంటే పంచవర్ష ప్రణాళికలద్వారా దేశంలో ప్రోగ్రెస్ వస్తోందని తామంతా అనుకుంటున్నారు. అంగీకరిస్తాను అయితే నూటికి 70, 80 మంది విద్యలేని హరిజనులు మొదలయిన అనేక రకాలైన మనుష్యులు దేశంలో ఉన్నారు నూటికి 75 రూ లో 50 రూ లో శ్రమదానం చేసేటటువంటివారికే యీ ప్లానింగుతరపున అభివృద్ధి జరుగుతుందితప్ప శ్రమదానం చేయలేని ప్రాంతాలకు ఇది వెళ్ళడంలేదు, కనీసం ఇంతపని జరిపిస్తామన్న ప్రచారమైనా జరగాలి దానికోసం అదనపు పన్నులు వేసినా నాకు ఏమీ అభ్యంతరంలేదు. శ్రీ మంగిపూడి వెంకటరత్న శర్మగారు నిరుద్ధభారతం అనే గ్రంథంలో "ఏ చట్టమయినా తగు ప్రచారం లేకపోతే అది విజయవంతంకాదు" అని స్పష్టంగా చెప్పారు. ఇవాళ ఒక ఉపగ్రహంలోనో, గ్రహంలోనో ఒక శునకమో, కనకమో పైని తిరుగుదోందంటే తత్సంబంధమయిన శాఖలవారు మీటింగులు పెట్టి ఇదిగిదుగో బ్రహ్మాండమైన శునకం వెళ్ళిపోతోంది దానికి బొంబాయికి - ఏలూరుకు, హైదరాబాదుకు ఉన్నంత

దూరం అని వారు ప్రచారంచేసుకుంటున్నారుకనుక ప్రచారం అవసరం ఏమీ ప్రచారంలేనందువల్ల మనం డిమాండుచేసి ఆర్థిక శాఖవారితో, వారితో వీరితో సంవత్సరమునకు ఒకసారి సంవత్సరాంతం రిపోర్టులో ఇన్నికోట్ల రూపాయల ఖర్చుపెట్టినామంటే ఆ కోట్లు ఎన్నో మాకు అర్థంకాక బడ్జెట్ పుస్తకాలన్నీ తిరగవేసే వరకు ఆ రోజు డిమాండ్సుమీద మాట్లాడే అవకాశం ఉండదు అందువల్ల ప్రచారం ఎంత అవసరమో గమనించమని స్పీకరుగారి ద్వారా ఇంకొకసారి మనవి చేస్తున్నాను ఎందుకంటే ఇది కేవలం సాంఘికవిప్లవంతో కూడిన బిల్లుకాబట్టి, సంఘంలో బ్రహ్మాండమయిన, నవ్యమయిన, దివ్యమయిన మార్పుతెచ్చే బిల్లుకాబట్టి దీని ప్రచారానికి ఆర్థిక మంత్రిగారు వినినా వినక పోయినా ఏదో అందులో కాస్త కత్తిరింపుచేసి పదిలక్షల రూ॥ లో 20 లక్షలో యీ సంవత్సరానికి కేటాయించి, వచ్చే సంవత్సరానికి 50 లక్షలు చేసి నాట్యాలద్వారా, బుర్రకథలద్వారా, సాహిత్యంద్వారా వాటి ప్రచారానికి ఒక డిప్యూటీ మంత్రినికూడా వేస్తే మంచిదని నేను చాలసారులుగా చెబు తున్నాను ఇటువంటి నాట్యకళలకు ఫారిన్‌లోను, సోవియట్ రష్యాలోను, ముఖ్యస్థానం ఉంది అటువంటి నాట్యాలద్వారా, బుర్రకథలద్వారా, సాహి త్యాలద్వారా ఇటువంటి ప్రచారానికి అవకాశం, అవసరం ఉందని ప్లానింగు డిపార్టుమెంటువారు గుర్తించి పంచవర్ష ప్రణాళికలక్రింద నాటకాలు, బుర్ర కథలు ఏర్పాటుచేస్తున్నారు కనుక ఆ విషయాన్ని మన ఆర్థిక మంత్రిగారు - శ్రీ గోపాలరెడ్డిగారు దృష్టిలో పెట్టుకొని-వారుకూడా కళాకోవిదులు. ఆ కళ అనే ఆయుధం ఎంతవరకు ఉన్నదో, ఎంతమందిని ఆకర్షించగలదో, ఎంత పటుత్వంగా అనుకున్న విషయాన్ని ప్రజలముందు పెట్టగలదో అనుభవంగల మన ఆర్థిక మంత్రిగారిని యోచన చేయమని నేను తమద్వారా వారికి మనవి చేస్తున్నాను.

మా మిత్రులు గున్నయ్యగారొక విషయం చెప్పారు. ఇన్నికాసుల బంగార ముంటేనే వివాహం చేసుకుంటామని, లేకపోతే లేదు అని చెబుతున్నారుకాబట్టి అన్నికాసులమీద నిషేధం పెట్టాలన్నారు. మిత్రుడు నారాయణప్పగారు చెప్పినట్లు అటవికజాతి వివాహాలు, ఉమ్మడి పెళ్ళిళ్ళు, రాక్షస వివాహాలు, గాంధర్వ వివాహాలు, కుంతీ వివాహాలు—అనేక రకాలైన వివాహాలు evolution of family of origin నుంచి యిప్పటివరకు జరుగుతూ వచ్చినాయి. కోయజాతి వివాహాలలో స్త్రీని తీసుకువెళ్ళి అరణ్యంలో వదిలిపెడితే, పెళ్ళి కుమారుడు వెళ్ళి ఆమెను బుజాలమీద ఎక్కించుకు తీసుకురావాలి. అంటే అతని భుజశక్తిని తెలుసుకునేందుకు ఆ పద్ధతిన చేసేవారు. హరిజనులలో వర కట్నము లేకున్నాని, స్త్రీకి డబ్బు యివ్వకోవాలి. దానిని 'వోలి' అంటారు.

హరిజనులలో భార్యా భర్తలు విడిపోవాలంటే కోర్టులు అక్కరలేదు. విడదీయటంగాని, కలిపివేయటంగాని క్షణంలో జరిగిపోతుంది ఆ పెద్దలను పట్టుకొని లీగల్‌గానో, ఇల్లీగల్‌గానో వాళ్ళకు కొంత పడవేస్తే ప్రొద్దుటికి యిద్దరిని విడదీసేస్తారు "ఏడుమనువులు, ఏర్గాళ్ళకావిడి" అని ఒక సామెత ఉన్నది ఏడు మనువుల వరకు చేసుకొనవచ్చునని చట్టం ఉన్నది—ఇది పల్నాటి పెద్దన్న పెట్టాడో, ముక్కుతిమ్మన్న పెట్టాడో తెలియదు ఆ పరిస్థితులలో కనీసం నాలు గయిదు కాసులైనా లేకుండా, ఉల్ఫాగా అయిదు రూపాయలకు పెళ్ళి చేసుకోమంటే కుదరదు వాడు తెల్లవారేసరికి, పిల్లను వదిలివేస్తాడో, ఏమౌతుందో తెలియదు మళ్ళీ యింకొక పెళ్లి చేసుకోవచ్చు అందుచేత ఆ పిల్లను వదలి పెట్టితే స్త్రీ ధనం క్రింద ఉంటుంది కాబట్టి, ఎక్కువగా 60 కాసులు, 70 కాసులు యివ్వాలని చెప్పనుగాని, ఏ నాలుగయిదు కాసులో యివ్వాలి ఏ క్షణంలోనైనా విడిచిపెట్టే అవకాశం ఉన్నది కాబట్టి కొంత స్త్రీ ధనం, పిల్లను చేసుకొనేటప్పుడు యివ్వాలి. ఆమె శీలవతి అయి, వివాహం చేసుకొనకుండా ఉంటే ఆ పది కాసులతో వర్తకమో ఏదోచేసుకు జీవించే ఆర్థిక వసతి కల్పించాలి లేకపోతే ఆమెను వదిలివేసిన పరిస్థితిలో యింకొకడు ఎవడూ వివాహం చేసుకొనకపోతే, ఆమెకు జీవనాధారం ఉండదు అది పేదవాళ్లలో యింకా కష్టాలు తెచ్చిపెట్టి, అవినీతిని ప్రోత్సహించే పద్ధతిగా పరిణమిస్తుందని మనవి చేస్తున్నాను

ఇంకొక విజ్ఞాపన చేస్తూ ముగిస్తున్నాను విజ్ఞానవంతులు, శాసనసభ్యులు, మంత్రులు, ఈ వ్యవహారంలో కొంత temptation పెడితే బాగుంటుందేమో వివర్ణ సవర్ణ వివాహాలు చేసుకొన్నవారికి first priority యిస్తామనో, పబ్లిక్ సర్విస్ కమిషన్ మార్కులు అవసరంలేకుండా డబుల్ ప్రమోషన్ యిస్తామనో, లేకపోతే రెండుఅంగుళాలు తక్కువ అయినా ఫర్వాలేదని సబ్ ఇన్స్పెక్టరుగా తీసుకొంటామనో లేక heart-weakness ఉన్నా ఫర్వాలేదు, విదేశాలకు పంపిస్తామనో, ఏదో కొంత consideration, కొంత encouragement యిస్తే, అటువంటి వివాహాలకు యువకులు వచ్చేవారున్నారు అయితే, వర్ణాంతర వివాహాలు చేసుకోవాలని చెప్పేవారింటికి వెళ్లితే "ఏదో అక్కడ ఉపన్యాసంలో చెప్పానుగాని, మనయింట్లోనా, యిటువంటిపని ? ఏ బ్రహ్మానందరెడ్డి గారి కొడుకో చేసుకుంటాడులే" అంటారు శ్రీ బ్రహ్మానందరెడ్డికి కొడుకులు లేరని ఆయనకు తెలుసు (Interruption శ్రీ సంజీవయ్యకు కూతుళ్ళులేరు !) (నవ్వు ) అందుచేత యిది జరిగేదికాదు

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి తప్పకుండా చేసుకుంటాము (నవ్వు).

కాకుండాపోతోంది ఈరోజున ప్రభుత్వం చేస్తున్న పనులు ఏమిటో ఆలోచిస్తే, నాకు ఒక రకమైన విచారం కలుగుతుంది ప్రభుత్వం పట్ల టాక్స్ పేయర్ కు డైరక్టుగా ఉన్నటువంటి అబ్లిగేషన్సు యన్‌ఫోర్సు చేయటం జరుగుతోంది ఈ పనిమాత్రం ప్రభుత్వంచేస్తోంది కాని మనిషికి మనిషికి మధ్య ఉన్న సంబంధాలను నిర్ణయించటానికి, ఆ సంబంధాలను అభివృద్ధిచేయటానికి ప్రభుత్వం ఏవిధంగాను ప్రయత్నించటంలేదు అదేరకంగా నూతనమైన సామాజిక విలువలు సృష్టించటంలో కూడ ప్రభుత్వానికి సంబంధం ఉన్నట్లు కనబడదు నిజానికి ప్రభుత్వానికి ఇందులో బాధ్యత ఉంది, పూచీ ఉంది ఎందుచేతనంటే,- ఒకసారి అరిస్టోటిల్ చెప్పాడు, "State was formed that men might live and exist and that men might live nobly" అని అందుచేత దేశంలో ఉన్న సమాజం యొక్క మనిషి జీవితం అభివృద్ధికావాలంటే, సరైనటువంటి నూతనమైన విలువలు సృష్టించాలంటే, ప్రభుత్వం చేయవలసిన పని కూడ కొంత ఉన్నది మనం మొదటినుంచి కొన్ని సాంప్రదాయాలను నిర్ణయించుకొన్నాము. చట్టానికి ఏ రకమైన విలువ ఉన్నదో, సాంప్రదాయానికి కూడ అదేరకమైన విలువఉన్నది. మనదేశంలో కస్టమ్స్, రిలిజియన్ మొదటినుంచి ఒక సోర్స్ ఆఫ్ లా అవుతూ వస్తున్నవి "Custom out-weighs law"- ఇదికూడ ఒక సూత్రంగా ఉన్నది అందుచేత మొదటినుంచి ఉన్నటువంటి ఆచారానికి ఏ చట్టానికి లేనటువంటి పటుత్వము బలము ఉన్నదని ఆచరణలో మనకు కనుపిస్తున్నది. ఈ విషయము ఎవరికి తెలియందికాదు మనం పాత సాంప్రదాయాలను మార్చి, నూతన పోకడలతో కూడిన సంస్కరణలను ప్రవేశపెట్టాలి ఒక సాంప్రదాయాన్ని మార్చినట్లయితే ఒక సంస్కరణ వస్తుంది అనేక రకాలైన, వివిధములైన సంస్కరణలు ఒకే సందర్భంలో సమూలంగా తీసుకురాగలిగినట్లయితే, ఒక విప్లవాత్మకమైన మార్పు దేశంలో వస్తుంది ఈ మార్పు సాధించేందుకు మనం శాసనసభను వినియోగించుకోవలసి ఉంటుంది. దానికోసం మనం ప్రయత్నం చేయవలసి ఉంటుంది ఎందుచేతనంటే,-

**Law that does not fulfil its social functions is not progressive Law has to meet with advancing needs of civilisation and growth of social consciousness**

అందుచేత చట్టం మార్పు చాలా అవసరమని నేను మనవిచేస్తున్నాను. మార్పును సాధించేందుకు అనేక రకాలైన మార్గాలు ఉన్నాయి. నాకు తెలిసినంతవరకు మూడు రకాలైన మార్గాలు ఉన్నాయి. (1) ప్రబోధం ద్వారా మార్పు తీసుకురావటానికి అవకాశం ఉన్నది. (2) ప్రాక్టీసు అండ్ యగ్జాంపుల్

ద్వారా కూడ మార్పు తీసుకురావచ్చును (బి) లెజిస్లేషన్ ద్వారా మార్పు తీసుకురావచ్చును లెజిస్లేషన్ చాలదనేవారు ఒక కారణము చెబుతారు చట్టంలో మనిషిని పెట్టినంత మాత్రాన, మనిషి మనస్తత్వంలో మార్పు సాధించ లేము కాబట్టి సంపూర్ణమైన మనిషిని తయారుచేయటానికి పూనుకొన్న ప్రతి ఒక్కడు, మనిషి యొక్క అంతరంగాన్ని ఒక కార్యరంగం క్రింద తీసుకొని అందులో మార్పు తీసుకురావటానికి ప్రయత్నించాలని చెబుతారు ఇది చాలా ఉన్నతమైన ఆశయము, చాలా ఉదాత్తమైన ఆశయము అందుకు సందేహం లేదు కాని, ఇందులో విస్తృతమైన, సామాజికమైన మార్పును సాధించటానికి ఏవిధమైన అవకాశములేదు కాబట్టి ఒక లెజిస్లేషన్ పద్ధతి దేశంలో ఉండాలి దేశం మొత్తం మీద మార్పు తీసుకురావటానికి అనుగుణంగా ఒక లెజిస్లేషన్ చేయవలసిన అవసరము ఉన్నదని మనవిచేస్తున్నాను అటువంటి అవకాశం యీ రోజున మనకు కలిగింది కాబట్టి, యీ చట్టం చేయటంలో వెనుకాడవలసిన అవసరము లేదు ఇందులో లోపాలు ఉంటే ఉండవచ్చును ఏమైనా జనరలైజ్డ్ కాన్సెప్ట్స్ ఉన్నప్పుడు, వాటిని కాంక్రీట్ ప్రోగ్రామ్ క్రింద మార్చవలసివస్తే, అందుకు ఖచ్చితమైన నిబంధనలు ఇవ్వవలసివచ్చినపుడు కొన్ని లోపాలు కనిపిస్తాయి , తప్పదు లోపాలుకనుపిస్తున్నవి కాబట్టి, అసలు చట్టమేవద్దుఅని అంటే మనము ఏవిధమైన చట్టము చేయలేము ఇంతవరకు మనము ఎకనామిక్ స్ఫియర్‌లోనే కొట్టుకుంటున్నాము ఈ సోషల్ స్ఫియర్ లోకి రాలేదు ఆర్థిక రంగంలోనైనా, మనం సాధించినటువంటి అభివృద్ధి ఏమిటి ? అందులో మనం సాధించిన ఘనవిజయము ఏమిటి?- ఈ విషయాలు మనకు స్పష్టంగా తెలియవు అసలు, సాంఘిక రంగాన్ని మనం ముట్టుకోకుండా వదిలిపెట్టాము అందుచేత యీ రోజున శ్రీ కాశేశ్వరరావుగారు ఇటువంటి అవకాశాన్ని ఆంధ్రదేశానికి ఇవ్వటం చాలా గర్వించతగిన కారణంగా నేను భావిస్తున్నాను మనము ఒక క్రొత్త సాంప్రదాయాన్ని సృష్టించాలి దేశంలో నూతనమైన పరిస్థితులకు అనుకూలం కానటువంటి పాత సాంప్రదాయాలను తుడిచిపెట్టటానికి, క్రొత్త సాంఘిక విలువలను సృష్టించటానికి ప్రయత్నించే వ్యక్తులు యీనాడు దేశానికి కావాలి 'సంఘ సంస్కరణల ఉద్యమం దేశంలో అంతరించిపోలేదు, ఇంకా ఉంది' అని చూపించటానికి అవకాశం కల్పించారు కాబట్టి, శ్రీ కాశేశ్వరరావు గారు చేసిన యీ కార్యము మంచిదని భావించటానికి తగిన అవకాశము వున్నది. ఏమైనా లోపాలు ఉంటే, ఆచరణలో అవి సర్దుబాటుచేసుకొని, కావలసిన మార్పులు చేసుకొని మనం ముందుకు పురోగమించటానికి అవకాశం ఉన్నది. ఎప్పుడూ ఆచరణలో చేయలేని పనులగురించి బాధపడి అసలు ఏ పని చేయకుండా కూర్చొంటే లాభంలేదు మహాత్మాగాంధిగారు ఒక విషయం చెప్పారు. అది నాకు గుర్తుకొస్తున్నది "If you want to do only that thing,

then you cannot do anything at all, do the thing which you think is right or a thing which is wrong and when you act incorrectly, then try to correct yourself" అని ఆయన అన్నారు కాబట్టి ఏవైనా పొరబాట్లు జరిగితే, ఆచరణలో వాటిని మార్చటానికి ప్రయత్నం చేయవచ్చును అందుకు అవకాశము ఉన్నది వివాహ సందర్భంలో, 300, 400, 500 రూపాయలు ఖర్చుచేయటానికి సావకాశము ఉన్నది అన్న విషయంలో ఒక పరిమితి ఏర్పాటు చేయాలి "కాని ఖర్చుపెట్టినప్పటికి ఇది వరకట్నం క్రిందకు వస్తుంది, కాబట్టి శిక్షార్హమైన పరిస్థితి ఏర్పడుతుంది" అని శేషాద్రిగారు తెలియజేశారు ఆవిధమైన భయం ఉండటానికి అవకాశం లేకుండా ఒక ప్రొవిజన్ ఉంటే బాగుంటుంది ఏ చట్టం చేసినా, దానిని చిత్తు చేయటానికి ప్రజలు ప్రయత్నించవచ్చును అందుచేత అనుభవంలో కొన్ని మార్పులు చేయవలసిన అవసరము ఉంటుంది "ఏ తల్లిదండ్రులైనా కూతురిపేర ఆస్తి రాస్తే ఏం చేయగలుగుతాము? ఆ డబ్బు ఇంకో రూపంలో ఇచ్చిన కట్నం కాదా?" అని నిన్న సుందరయ్యగారు అన్నారు. వారు చెప్పింది నిజమే కాబట్టి ఖచ్చితమైన సూచనలు ఏర్పాటుచేయాల్సిఉంటుంది కాని, మనిషి యొక్క మనస్తత్వం మార్చటానికి ఒక ఖచ్చితమైన సూత్రం, నిబంధన, చట్టం లేదన్నది నిజము కాని, మనం పురోగమించ వలసినప్పుడు, ప్రారంభించవలసిన కార్యక్రమం ప్రారంభించాలి ఆచరణలో వచ్చే అనుభవాల బట్టి తగు మార్పులు చేసుకోవలసిన అవసరము ఉంటుంది కాబట్టి యీ బిల్లును పాస్ చేయాలని నేను మనవిచేస్తున్నాను ఎందుకంటే, యీ డౌరీసిస్టమ్ యీరోజున దేశంలో ఉన్నటువంటి హ్యూమన్‌పరసనాలిటీకి (స్త్రీలు కానీండి, పురుషులు కానీండి) సరైనటువంటి రికగ్నిషన్ లేనటువంటి పరిస్థితి ఏర్పాటుచేసిందని నా అభిప్రాయం

"Dowry system is undermining the liberty of women, and with a view to bring women folk into justice and particularly in economic and social sphere and with a view to recognize the dignity of women and worth of human personality the dowry system should be given a speedy good-bye, Jai Hind."

శ్రీ కె. కృష్ణమాచారి (వంగారెడ్డి - జనరల్) గౌరవ అధ్యక్షా, ఈ **Dowry Prohibition Bill**ను యిక్కడ శాసన సభముందు ప్రవేశ పెట్టినందుకు ప్రథమములో శ్రీ కాశీశ్వరరావుగారికి నా హృదయపూర్వకమైన అభివందనములు సమర్పిస్తూ, దీనిని గురించి కొన్ని ముఖ్యమైన విషయాలు సభవారి దృష్టికి తేదలచి మాట్లాడుతున్నాను. ప్రపంచము ఎంతోముందుకు పురోగ

మిస్తున్న యీ సమయంలో మానవులు భూమినుంచి ఆకాశములోనికి వెళ్ళ డానికి మార్గాలు వెతుకుతూ ఉండే ఈ సమయములో మనము యిక్కడ కూర్చుని మనలో ఉన్న యీ సాంఘిక దురాచారమును యీ కట్నము తీసు కునే దురాచారమును గురించి మనము యిక్కడ తర్కించుకుంటున్నామని అంటే, మనకు యిది బహుశ ఒక కళంకమేనని నేనుభావిస్తున్నాను ప్రపంచం ఎంతో ముందుకు పురోగమిస్తున్న కాలములో మనము యింకను యిదే పరిస్థి తిలో భూమిలో లేకుండా పాతాళమువరకు వెళ్ళుతున్నాము అంటే, ప్రపంచ పరిస్థితులనే మనము తెలుసుకోలేనటువంటి పరిస్థితిలో ఉన్నాము అని నా భావన ఇది చాల విచారకరముగా ఉన్నది ఇప్పటికి ఎన్నడో యిది బిల్లు రూపంలోనే కాదు, కార్యరూపములోనే ఎన్నో సం లకు ముందే రావలసి యుండెను, కాని రాలేదు అది మన దురదృష్టమనే చెప్పాలి కనీసము యిప్పటికైనా యిది వచ్చింది ఇది ప్రజలలో నూతన భావములను రేకెత్తించి దురా చారము, నీచమైనది మన సంఘములో ఉండకూడదు అని ఆలోచిస్తున్నప్పుడు, ఇప్పటికి కొద్దిగా ఆలస్యము అయినప్పటికినీ యిది యిప్పుడు ఒక సుసమయమే గనుక, మనము ఈ బిల్లును ఎంత త్వరలో pass చేస్తే, మన ప్రజానీకమునకు, సంఘమునకు, అంతమంచిని చేకూర్చిన వారమవుతామని నేను మీ కంద రికీ తెలియజేస్తున్నాను ఈ దురాచారము, మన పూర్వచరిత్ర చూస్తే, మొదట్లో యిది ఏ రాజుల వద్దనుంచో, ఏ ధనవంతుల వద్దనుంచో మెల్లమెల్లగా ప్రాకి, యీ రోజున మన జనసమూహములో ప్రవేశించి, అందులో ముఖ్యంగా సామాన్య మానవులకు అభివృద్ధి నిరోధకముగ తయారైంది ఈ రోజులలో విద్యాహీనులకంటె, విద్యావంతులలోనే యీ వ్యాధి వ్యాపించిందని మనవి చేస్తున్నాను అయితే ఇక్కడ యీ సభలో ఉన్న స్త్రీ సభ్యురాండ్రు మాట్లా డుతూ కొన్ని ముఖ్యమైన విషయములు యీ బిల్లును గురించి చెప్పారు వారుచెప్పిన సంగతులు అన్నీ చాలా బాగానే ఉన్నవి అందుకు వారందరినీ నేను అభినందించుచున్నాను కాని మనము చేసేది చూస్తే మనయొక్క practical life లో పురుషులకంటె స్త్రీలే ఎక్కువగా కట్నములకొరకు, ఆశ పడుతున్నారని, దానివల్ల ముఖ్యముగా పేద కుటుంబములవారు, మర్యా దస్థులు ఎక్కువగా బాధపడుతున్నారనే విషయము మాత్రము నేను యీ సందర్భములో చెప్పవలసి వస్తున్నది కాని పురుషులే కొద్దో, గొప్పో తమ యొక్క భావాలను సవరించుకోటానికి సంసిద్ధులుగా ఉన్నారు కాని, స్త్రీలు మాత్రము అందుకు సంసిద్ధులుగా లేరని బోధపడుతున్నది ఎందువల్లనంటే, వివాహోము విషయములలో కట్నముకొరకు ఆశపడి, "మా పిల్లవానికి పెళ్ళి కాకపోయినా సరే, కట్నము తగినంత తీసుకోనిదే, పెళ్ళి జరగనివ్వము" అనే పట్టుదల చూపే స్త్రీలు నూటికి తొంభైమంది యీనాడు దేశములో ఉంటు

న్నారని నేను నిష్పక్షపాతముగా చెప్పదలచుకున్నాను. అయితే ఈ సందర్భంలో ఒక్క విషయం మనవిచేస్తాను ఈ భావము కేవలము స్త్రీలలోనే ఉద్భవించిందా అనిఅడగవచ్చు "మా పిల్లవాడి చదువుకు యింత ఖర్చుచేశాము, దానివల్ల మా డబ్బు యింత ఖర్చుఅయినది గనుక ఈ డబ్బు అంతా మనకు వస్తే, తిరిగి అమ్మాయి వివాహామునకు యీ సొమ్ము ఖర్చుచేయవచ్చు" అనే స్త్రీలుకూడ లేకపోలేదు ఇలాంటిభారము కలిగినప్పుడు స్త్రీలకొరకు పురుషులను కొనుక్కుంటున్నారా అనేది ప్రశ్న ఈ రోజున కట్నము యివ్వవలసివస్తే, ఈబాధ పిల్లయొక్కతల్లికి ఉండదు అది తండ్రికే తల్లికిఉండేబాధ ఒక్కటే మా అమ్మాయిని మంచి గొప్ప విద్యావంతునికి, ధనవంతునికి యివ్వాలి, అమ్మాయి అక్కడికి వెళ్ళి సుఖజీవనము చేయాలని ఉంటుంది కాని కట్నముక్రింద సొమ్ము చెల్లించేది తండ్రి. ఇక ఆ తండ్రియిల్లు తాకట్టు పెట్టుకునో, పొలము అమ్ముకునో, మరేవిధముగనో ఆ డబ్బు సేకరించుటకు పడేబాధ అంతా యింతా కాదు ఈ విధముగ చేయడమువల్ల ఆ కుటుంబము పేదదై తిండి జరగని పరిస్థితివచ్చి, నాశనమునకు దారి తీయడమే జరుగుతున్నది ఇక ఆ బాధ్యత అంతా తండ్రిదికాని, తల్లిదికాదు అందువల్ల యిది కేవలము తల్లులయొక్క సమస్యగా ఉండదు ఇది తల్లిదండ్రులు యిద్దరికి చెందిన సమస్య అందువల్ల స్త్రీలను అన్యాయము చేస్తున్నారన్న దృక్పథము మాత్రము ఉండకూడదు ఇది ఇద్దరికి సంబంధించిన సమస్య అయితే యిందులో పురుషులకే ఎక్కువబాధ ఈ బాధలనుంచి అట్టి కుటుంబములను తప్పించటానికే యీ బిల్లు తేవడమయింది ఇది మంచిదేనని మాత్రము నేను మనవి చేస్తున్నాను కాని నేను ఎక్కువగ చెప్పడంలేదు. ఈ శాసనములో కొన్ని మార్పులు చేయటానికి సవరణలుకూడ యివ్వబడినవి. అందులో ముఖ్యమైన సవరణ ఒకటి గోపాలకృష్ణయ్యగారిది ఉన్నది బహుశ పెళ్ళిలోపల చీరెలు మొదలైనటువంటివి ఏహో చిన్న చిన్న వస్తువులు పెట్టినప్పటికినీ, బహుశ Technical దృష్టితో చూస్తే, అది నేరము కావచ్చు, అందువల్ల అలాంటి చిన్నచిన్న లోపాలను కొంతవరకు సవరించటానికి చిన్న చిన్న సవరణలుచేసి యీ బిల్లును త్వరలో Pass చేస్తే చాలా బాగాఉంటుంది

ఇంకొక విషయము చెబుతున్నాను, ఇక్కడ యీ బిల్లును Pass చేస్తున్నాము ఇది శాసనము అవుతుంది. ఈ శాసనమును నిర్మాణ కార్యక్రమములోనికి తేవాలి ఈ సభలలోకి మనము ప్రజా ప్రతినిధులంగా వచ్చి ఉన్నాము. మనము రాష్ట్రములో ఉన్న ముక్కోటి ఆంధ్రులకుగూడ ప్రతినిధులమే. దీనిని చట్టము చేసిన తరువాత ప్రజలు దీనిని ఆచరణలో పెట్టుతారా అంటే, లేదు అనే అనుమానము చాలమందికి కలుగుతున్నది చాలమంది శాసన సభ్యులు

యిది ఆచరణయోగ్యముకాదు, అని వక్కాణించి చెప్పారు ఇలాంటిభయము ఎందుకు వారికి కలిగిందో, మనకందరికీ యీ ప్రాతినిధ్యము ఎందుకు వచ్చిందో నాకు అర్థముకాక నేను అయోమయ పరిస్థితిలో పడ్డాను మన మందరము రాష్ట్రములోఉన్న ముక్కోటి ఆంధ్రులకు ప్రతినిధులముగా యిక్కడికి వచ్చాము మనము వచ్చిన నియోజకవర్గములలోని ప్రజలతోటి మనకు సంబంధము ఉన్నది గనుక, యిది ఆచరణ యోగ్యముగ చేసే బాధ్యత గూడ మన అందరిమీద ఉన్నదని గుర్తించాల్సి ఉన్నది ఆ బాధ్యత మన తల పైన ధరించి మన నియోజకవర్గములలో election ప్రచారము చేసేవిధంగా, యీ బిల్లు విషయములోకూడ నిర్విరామముగ ప్రచారముచేసి, ప్రజలలో కట్నము నిరోధించాలి, ఇది నీచము, అపచారము అని బోధించాలి, ఆ విధముగచేస్తే, కొంతమట్టుకు తృప్తికరముగ దీనిని ఆచరణ యోగ్యము చేయ వచ్చునని నా నమ్మకము దానిని ఆచరణలో పెట్టగలమా, ప్రజలను ఒప్పించ గలమా అనేభయము మనకక్కరలేదు ఎప్పుడయితే యిది శాసనముగ చేస్తు న్నామో, నిస్సందేహంగా మనము చేసేకృషివల్ల ఆచరణలో పెట్టవచ్చు ఈ పని తప్పక జరగగలదని నా అభిప్రాయము ఇక్కడ 300 మందికి పైగా శాసన సభ్యులము ఉన్నాము మనకు ఉన్న పిల్లలసంఖ్య అంతా లెక్కవేస్తే దాదాపు ఏ వెయ్యిమందో ఉండవచ్చు ఈ పిల్లలందరికీ పెళ్ళిళ్ళు చేసేటప్పుడు కట్నమును నిరోధించి చేయండి ఇది ప్రజలకుగూడ ఆదర్శవంతము అవుతుంది దీనినుంచి వారు నీతిపాఠము నేర్చుకుంటారు అప్పటికి యీ కృషి కొంతవరకు ప్రజలలో పాకిపోయి, ప్రజలకు బోధపడి, యీ దురాచారము అదృశ్యము కావడము ప్రారంభిస్తుంది ఇది ఆచరణ యోగ్యముగ చెయ్యటానికి కేవలము ప్రచారమే సాధనముకాకుండ, యీ వెయ్యిమంది పెళ్ళిళ్ళు చేసేటప్పటికి ప్రజల భావములు మారకపోవు, ఆ విధముగచేస్తే మనము చేసిన శాసనమును మనము గౌర వించుకున్నట్లు ప్రజలకు తెలియజేస్తే, వాళ్ళ మనస్తత్వము మారిపోతుంది ఇది ఆచరణ యోగ్యము చేయాలంటే, ఇదితప్ప వేరు మార్గములేదు. గట్టిగా నమ్మండి శాసన సభ్యులమైన మనమే ముందడుగు వేయాలి దీనివల్ల ప్రజలకు బుద్ధి, శీలం ఏర్పడుతవి. కట్నము కోరాలనే నీచవృత్తి మానక తప్పదు అది నీచవృత్తులనే మనము ప్రచారముచేసి, ప్రజలలో మనోపరివర్తన కలుగజేయాలి. అలాచేస్తే, యీ బిల్లుయొక్క ప్రయోజనము కొద్ది రోజులలోనే తెలుస్తుంది అంతేకాని మాకు ఏవోకొన్ని సాంప్రదాయాలు ఉన్నవి. అవి మేము ఆచరిం చాలి అని అంటే లాభములేదు అవి తుప్పుపట్టిన పాత సాంప్రదాయాలు అవి మార్చవలసి వుంటుంది ఎంతవరకైతే మనము మార్చకుండ పాత సాంప్ర దాయాలను పట్టుకుని వ్రేలాడుతూ ఉంటామో, అంతవరకు మనము మన సంఘమును పురోగమింప చేయలేము. కాబట్టి ఈ బిల్లును అతిత్వరలో ప్యాసు

చేయవలసిందని సభ్యులనందరినీ కోరుతూ, అధ్యక్షులవారు నాకు యీ అవ
కాశము యిచ్చినందులకు అభివందనములు అర్పిస్తూ, యీలాంటి ఉపయోగ
కరమైన బిల్లు తెచ్చినందుకు శ్రీ కాశేశ్వరరావుగారిని నేను అభినందిస్తూ
సెలవు తీసుకుంటున్నాను

*Srimathi Masooma Begum (Pathergatti)* Mr Speaker, Sir I rise to support the Andhra Dowry Prohibition Bill It seeks to prohibit dowry in the State of Andhra I am happy to see, from the 'Application of Act', that it says that the Act applies to all persons domiciled in the State, whether the marriage is performed within or without the State, and does not restrict to any one community but to all persons domiciled in the State Although there is no compulsion for any religion regarding this, the custom is there And not only the Hindus but Catholic Christians, if I am not wrong, and Muslims suffer from it.

The dowry system was, perhaps, prevalent because Hindu girls do not inherit any property from their father's share But I do not suppose this should be a hindrance in view of the Hindu Women's Right to Property Act The money of dowry does not go to the girl herself but goes to her husband whom she has, if I may say so, to buy More than women, I think men should protest against this and support the abolition of this custom. The poet Hali says ·

هم کرتے هں عادت کی مقدما اطاعت عالا ما م
اصلاح پدر اس لئے عادت نہیں هوتی

The poet says that we have a slavish mentality towards customs and that habit cannot be reformed I may point out to you that as early as 1918, the Muslim Ladies' Conference vehemently protested against this custom under the presidentship of the Begum of Bhopal Then, in June 1935, the Munnurukapu Conference passed a resolution condemning the dowry system In the Bihar Legislative Assembly in 1938, a non-official Bill called the Bihar Dowry Restraint Bill which was very much on the same lines as this Bill, was introduced by Mr. Shukla Sen. The Hyderabad Women's Conference also in the same year protested against the evil custom of demanding dowry. Mrs. Suti had put forward this resolution and it was supported by Rani Saraladevi of Wanparthy.

As you know, ideals are realised slowly and gradually and, perhaps, never completely. The Bill does not include 'Dowr' and 'Mehr' in the case of persons to whom the Muslim Law applies.

We are here dealing with the dowry and not the 'dowar' or 'Mehar' and that should apply to all irrespective of any religion, caste or creed 'Mehr', according to Muslim Law is a sort of restriction on the unreasonable powers exercised by the husband for divorce Therefore, there is no question of this Bill either transgressing the bounds fixed or infringing any provision of the Muslim Law In the minutes of the meeting of the Select Committee, Mr Kaleswara Rao says that the Bill does not interfere with the custom prevailing among Muslims as the Bill sought to exempt them from the purview of the Bill It is a social legislation and has no bearing on any religion Muslims are equally affected by the course of the dowry system Poor and lower middle classes specially are affected most and in the name of, as they call گھوڑے جوڑے کی رسم they demand enormous sum, and the result is that the parents, if they cannot afford to pay the amount do not get their daughters married off very easily

So, while supporting the Bill, I hope that this will not restrict only to one community because the Bill in itself describes and says that it will apply to all persons And I trust that it will take all persons into its purview Thank you, Sir

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ ఇంక ఒక గంటమాత్రం వుంది ఇంకా 8 ఉపన్యాసకు లున్నారు పేర్లిచ్చిన వారందరూ మాట్లాడ గోరినట్లయితే యివ్వాళ యిది ముగింపుకాదు కావున ఎవరయినా విరమించదలచుకుంటే దయచేసి నాకు తెలియపరుచ కోరుతున్నాను మాట్లాడదలచుకున్నవారు కొద్ది సమయము తీసుకుంటే బాగుంటుందని సభ్యులు గమనించాలని కోరుతూ శ్రీ ప్రగడ కోటయ్యగారు మాట్లాడవలెనని కోరుతున్నాను

శ్రీ ప్రగడ కోటయ్య అధ్యక్షా, నేను యీ బిల్లుమీద ముందు మాట్లాడాలని అనుకోలేదు ఒకరిద్దరు మిత్రులు మాట్లాడిన తరువాత నా అభిప్రాయం కూడా చెప్పాలని అనుకున్నాను ఈ బిల్లును నేను వ్యతిరేకించడంలేదు ఈ బిల్లు రావడం మంచిది కావచ్చు కాని మనం సాధించగలిగే ప్రయోజనం మాత్రం బహుళః యేమీ వుండదని మనవిచేస్తున్నాను. ఎందుకంటె రాజమంద్రి వాస్తవ్యులయిన శ్రీ కాళ్ళకూరి నారాయణరావుగారు ఒక బ్రహ్మాండమయిన నాటకాన్ని వ్రాశారు. దానిపేరు 'వరవిక్రయము'. ఆంధ్రదేశములో 'వరవిక్రయము' నాటకము ఆడనటువంటి గ్రామం వుండదనుకుంటున్నాను. బహుళః ఆ నాటి 50 లక్షల ప్రజలను చాలమందిని ఆకర్షించింది. అంటే నాటకం

చూచినంతసేపు ఆకర్షించి వుంటుందేతప్ప నాటకంనుంచి తిరిగివెళ్ళిన తరువాత దాని ప్రతిఫలంమాత్రం ప్రజలమీద యేమీ లేదనేది తిరిగి యీ శాసనం యీనాడు రావడంవల్ల మనం అర్థంచేసుకోనడానికి అవకాశం కలుగుతున్నది అసలు వున్నచిక్కు యేమిటంటే కట్నాలు ఎందుకు వస్తున్నాయి ? కట్నాలు వస్తున్నమాట యదార్థం ఇవ్వాళ Engineering seat వస్తే ఆ కుర్రవాడికి 25 వేల రూపాయలు కట్నం యిస్తాం అంటున్నారు M B B S seat వస్తే 50 వేల రూపాయలు కట్నం యిస్తాం అంటున్నారు అలానే పెద్ద పెద్ద చదువులు చదువుకొని, సరాసరి ఏ gazetted officer లేక అంతకంటె మించిన ఉద్యోగం చేయడానికి, అర్హత, యోగ్యత, అవకాశం వున్నటువంటి వారికి మాత్రమే యీ కట్నాల విషయంలో చాలా హెచ్చుగా బేరాలు వస్తున్నా యనేమాట యదార్థం ఇది మన మనస్తత్వం యొక్క లోపంతప్ప బహుశః కట్నాలు పుచ్చుకుంటున్నవారి లోపంకాదు ఎందుకంటే శరీరశ్రమద్వారా పొట్ట పోసుకోవడం అంటే చాలా నీచంక్రింద వచ్చింది ఇది యితరులనుగూర్చి చెప్పడంకంటె నాకు సంబంధించినంతవరకు చెప్పుకోవచ్చు ఇప్పుడు మేము నేతనేసేవారము సాధారణంగా నేత నేసుకుంటే నెలకు 25, 30 రూపాయలు వస్తాయి అంతకంటె అదనంగా సంపాదించడానికి అవరోధాలున్నాయి ఎవడయినా ఖర్మంచాలక School Final చదువుతున్నాడంటే ఆయన తిరిగి రాట్నందగ్గర కూర్చుని ఒక చిలప ఎలవడం నేరం, లేదా వాని తల్లి దండ్రులు పడుగు చేస్తుంటే ఆ పడుగుదగ్గర నిలబడి కుంచెపట్టడం నేరముగా కనిపిస్తున్నది అలాగే యీ చదువులో వున్నటువంటి లోపమే మనలను యీ స్థితికి తీసుకు వెళ్ళుతుందేమో తప్ప బహుశ మనం కావాలని తెచ్చుకున్నటువంటిదికాదు. మన విద్యావిధానంలో వున్న ప్రధానమైన లోపము ఇవ్వాళ 4, 5 ఎకరాల పొలమున్న రైతు తన బిడ్డను School Final వరకు చదువు చెప్పిస్తే ఆ అబ్బాయి పశువులకు మేతవేయడు, పశువుల దగ్గరనున్న పేడతీసి వేయడు, Buckingham & Carnatic Mills లో తయారైన డ్రిల్లు లాగు కట్టుకుని అమెరికాలో తయారైన poplin చొక్కా వేసుకుని కాఫీ హోటల్సుకు నాలుగుపార్లువెళ్ళి, వున్న నాలుగెకరాల ఆస్తి పాస్తులను తగలెట్టడం, Lower Division గుమస్తావని వస్తుందా, Attender పని వస్తుందా, దీనికి ఎంత కట్నం వస్తుందా అనే ఆలోచనలో పడలేదు. అలాంటి పరిస్థితులలో మనం వున్న తరువాత యిలాంటి శాసనాలవల్ల దేశములో పరివర్తన వస్తుందని యీ పరివర్తనద్వారా చాలామంచి మార్గాన వెళతామని అనుకోడం భ్రమ. ఏసుక్రీస్తు పుట్టిపోయాడు, ఆయన తరువాత చెప్పుకోతగ్గవారిలో మహమ్మదు, ఆతరువాత మహాత్మాగాంధీగారు వున్నారు. మహాత్మాగాంధీగారు చాలా బోధనలు చేసి వెళ్ళారు. ఆయన రాజకీయంగా మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టడమే కా

కుండా మనిషిలో నీతినియమాలు ఏ విధంగా వుండాలో మనిషిలో పరివర్తన ఎందుకురావాలో, సమాజం ఏవిధమైన ఆరాటం, పోరాటం లేకుండా సుఖంగా బ్రతకడాకిని అనువైన పరిస్థితులు ఏ విధంగా కల్పించుకోవాలో చెప్పారు కాని యివ్వాళ నీతినియమాలు కాంగ్రెసువాదులలోనే హెచ్చుగా కొరవడి వున్నాయనె విషయం మనం చెప్పుకోవాలి అందువల్ల ప్రధానంగా నీతినియమాలకు కట్టుబడి మనం ఉండడంలేదు అయినపుడు యీ శాసనాలద్వారా నీతి, నియమాలు అదనంగా అనుసరించగలుగుదుమని అనుకోవడం సరికాదు నేడు ప్రతిఒక్కరూ "ఉద్యోగం కావాలి ఉద్యోగం చేసేవారికే మా పిల్లను యివ్వాలి" అంటారు తప్ప "నేను నేతనేస్తాను నాకు 30 రూపాయలో 40 రూపాయలలోపు ఆదాయం వస్తాయి నాకు తోడుగా నాకిచ్చేఅమ్మాయి కూడా నేతనేర్చుకొని, లేకపోతే కండెలుచుట్టి నాకు సహాయపడితే కుటుంబం సాగిపోతుంది" అంటే "అబ్బే, మాకు పనికిరాదు ఆ సంబంధం" అని చెబుతారు. రైతుల అమ్మాయిలను వ్యవసాయం చేస్తున్నవారి నాగలిపట్టి దున్నేవారి కిస్తారా అంటే వారికి యివ్వడానికి తలిదండ్రులు అంగీకరించడంలేదు B E చదివే ఆయనకో M B B S చదువుకున్న ఆయనకో, సరాసిరి I A S కు కూర్చున్నవారికో మా పిల్లను యివ్వాలనుకొన్నప్పుడు వారు కట్నాలడిగితే యివ్వడంలో తప్పేమి వుందని అడుగుతున్నాను వారంతా కొన్నివేల రూపాయలు ఖర్చుపెట్టి సుఖముగా బ్రతకాలనుకున్నపుడు ఆ సుఖంగా బ్రతికే వాడే నాకు మొగుడుకావాలి అని కన్య అనుకున్నప్పుడు తప్పనిసరిగా సాధ్యమైతే కట్నం ఇచ్చిఅయినా పెండ్లి చేసుకోవడం తప్పులేదు అందువల్ల ఈ శాసనంద్వారా కట్నాలు నిషేధించాలని అనుకోవడం మాత్రం బహుళ వెర్రిక్రింద వస్తుందేమోతప్ప కట్నాలు ఇవ్వడం ఆగదు జరుగదు, ముమ్మాటికి ఆగదు మనుష్యులలో పరివర్తన రావాలి. మనుష్యులలో పరివర్తన రావడానికి ప్రచారం కావాలని అంగీకరిస్తున్నాము కాళ్లకూరి నారాయణరావుగారి 'వరవిక్రయం' కంటె హెచ్చుగా ప్రచారం చేయగలమా యివ్వాళ? శ్రీ కాశేశర్య రావుగారి బిల్లుపై శాసనసభలో నాలుగు రోజులు చర్చచేస్తే, ఆచర్చ అనంతరం కూడా 'వరవిక్రయం' నాటకం కంటె హెచ్చుగా ప్రచారం చేయడానికి అవకాశం వున్నదా అని అడుగుతున్నాను ప్రచారం యేమిచేయాలి, ఎందుకు చేయాలి అన్నప్పుడు మనం ఎవరికివారు వంతువచ్చినప్పుడు బహుళః ప్రచారాన్ని కట్టిపెట్టి ఈనాడు ఆస్తిపాస్తులున్న శాసనసభ్యులు చాలమంది వున్నారు కదా ఎవరి బిడ్డలకు కట్నాలు యివ్వకుండా ఎవరి బిడ్డలకు కట్నాలు పుచ్చుకోకుండా, యీ శాసనం అనంతరమైనాసరే నిక్కచ్చిగా నీతిగా వ్యవహరిస్తే దానినిబట్టి యీ శాసనం దేశంలో ఎంతవరకు అమలు జరుగుతుందో ఆధారపడి వుంటుందితప్ప లేకపోతే ఆధారపడి వుండడానికి అవకాశంలేదు.

మనలో చాలవరకు నీతి చచ్చిందనే నగ్నసత్యాన్ని అంతా అంగీకరించాలి మహాత్మా గాంధీ వచ్చి ప్రపంచం మరమ్మత్తుకు కృషి చేయాలని చెప్పిపోయినా, ప్రపంచంలో పూర్తిగా మరమ్మతుజరగటం అసాధ్యంగా కన్పిస్తున్నది మహాత్మా గాంధి ఆశించినట్లు, ఏసుక్రీస్తు ఆశించినట్లుగా, వివేకానందస్వామి ఆశించినట్లుగా మరమ్మతు జరగటమే సాధ్యమయితే అది జగడమవుతుంది మనమందరము సన్యాసులము కావలసివస్తుంది కాని అసలు ఆశించినంతగా మరమ్మతు జరుగదు. కాకపోతే అనుకున్నదానికంటే కుళ్ళు ఎక్కువ ప్రవేశించకుండా వుంటుందేమో! ఈ కుళ్లు శృతిమించిపోయి నట్లయితే, దానిని సర్దుపాటు చేయటానికి అవకాశం కల్గుతుంది తప్ప, కుళ్లు అంతా మొత్తం మననుండి తీసివేయడం సాధ్యంకాదు మనం మనుష్యులుగా వున్నంతవరకు, మనలో పశుత్వం వున్నంతవరకు, పూర్తిగా నీతికి కట్టుబడివుండలేక పోతున్నాము మనలోగల పశుత్వమును చంపుకోటానికి ఎంతవరకు ప్రయత్నిస్తే అంతవరకు మన సమాజాన్ని ముందుకు తీసుకొని పోగలము, తప్పితే, లేకపోతే, ముందుకు వెళ్ళడానికి అవకాశము లేదు అందువల్ల మనమందరము ఆశించినంతగా ఈ శాసనం ఉపయోగపడక పోవచ్చు కేవలం శాసనం తేగలుతున్నామనే ఆత్మ సంతృప్తి కల్గవచ్చు అని తెలియజేస్తూ యింతటితో సెలవు తీసుకుంటున్నాను.

*Sri P. Sundarayya (Gannavaram)* Sir, I beg to move

"That the question be now put"

*Mr. Deputy Speaker*: The question is

"That the question be now put."

The motion was adopted.

*Mr Deputy Speaker* The question is

"That the Andhra Dowry Prohibition Bill, 1955 as reported by the Select Committee, be taken into consideration"

The motion was adopted.

*Clause 2.*

*Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli)*: Sir, I beg to move:

"That in clause 2 (1) after the word 'persons' in line 1, insert the words 'including those'."

*Mr. Deputy Speaker*: Has the hon. Member Sri L. Lakshmana Das any objection to this amendment.

*Sri L Lakshmana Das* I have no objection to accept this amendment, Sir

*Mr Deputy Speaker* The question is

"That in clause 2 (1) after the word 'persons' in line 1, insert the words 'including those' "

The motion was adopted

*Mr Deputy Speaker* The question is

"That clause 2, as amended, stand part of the Bill"

The motion was adopted

Clause 2, as amended, was added to the Bill

*Clause* 3

*Sri L Lakshmana Das* Sir, I beg to move

"That in sub-clause (1) of clause 3, insert the following words before the words 'to any other person'—

'the parent or guardian of such other party or' "

*Mr Deputy Speaker* Motion moved

Sri Vavilala Gopala Krishnayya has given notice of another amendment to this clause, just now Under rule 129 (1) of the Assembly Rules, I waive the notice, because it has been received just now and it ought to have been received a day earlier Sri Vavilala Gopalakrishnayya can now move his amendment

*Sri Vavilala Gopala Krishnayya* Sir, I beg to move

"That after the Explanation to clause 3, add the following as Explanation II

'Explanation II: Presents of clothes or articles of cloth of the aggregate value of not exceeding Rs. 500 given by either party at the time of the marriage do not constitute 'Dowry'. "

*Mr Deputy Speaker* Motion moved

*Sri L Lakshmana Das* This is agreeable to me, Sir

*Sri P Basi Reddi (Pulivendala)* May I speak on the 'Definition', Sir?

*Mr Deputy Speaker* Yes

*Sri P Sundarayya* Sir, I too have got amendments to move Shall I move now, Sir?

*Mr Deputy Speaker* Yes

*Sri P Sundarayya* Sir, I beg to move

"Add the following as new Explanation at the end of clause 3 (a)

> 'Explanation III Any immovable property given by a registered document to the bride and any movable property or valuable security declared to be given to the bride and filed before a Registrar either at the time of marriage before or after by any other persons shall not be considered as 'Dowry', but be considered as 'Shreedhana' which cannot be alienated by her within a period of 10 years."

*Mr Deputy Speaker* Motion moved

All the amendments have been moved and members who have moved them can speak now, if they want to.

*Sri P. Basi Reddi* Before the above specific amendments are taken up, may I speak on 'Definition' generally?

*Mr. Deputy Speaker* : The member has to speak with reference to clause 3 and the amendments just now moved

*Sri P. Basi Reddi* : I have got very serious objection to the 'Definition' itself, and am raising it by way of a point of Order, Sir.

*Mr. Deputy Speaker*. Yes.

*Sri P. Basi Reddi*. Sir, by the change of definition of 'dowry' at the Select Committee stage, the scope of the Bill as originally introduced in the House has been changed. 'Dowry' in the generally accepted sense, is 'property or money given by the parents of the girl to the bridegroom'. Now, the definition as we find it in the Bill as reported by the Select Committee, goes beyond the scope of the Bill originally introduced, and it now includes money or property given by the bridegroom also. Therefore, I think that Rule 130

of the Assembly Rules is a bar to such change, i e to the inclusion of money, etc, going from the bridegroom's side, as that is beyond the scope of the Bill as originally introduced in the Assembly Even the Title of the Bill itself is 'Dowry Prohibition Bill' and the preamble also is to the same effect Also, in the Select Committee, in the course of his speech Sri A Kaleswara Rao said

*Sri P Sundarayya* Sir, I raise another point of Order

ఇప్పుడు వారు raise చేస్తున్నదీ ఏలా ట్లా డే దీ అంతా కూడా consideration stage లోనే తీసుకోవాలి, కాని యిప్పుడు Bill అంతా తీసుకొని ఈబిల్లులో ప్రధానమైన Definition గురించి Select Commitee కి పంపించాము, అక్కడ publish అయినది, ఈ బిల్లు మొదటి బిల్లుయొక్క ఉద్దేశాన్ని దాటిపోయింది అన్నట్లయితే consideration stage లోనే raise చేసియుండవలసినది ఒకవేళ అప్పుడు అట్లా raise చేయక పోయినా consideration ను అయినా వ్యతిరేకించాలిగాని, House consideration తీసికొన్న తరువాత ఆ Definition, Constitution కు వ్యతిరేకంగా వుంది అంటే అది వేరే ప్రశ్న, కాని యిది బిల్లు ఉద్దేశాన్ని దాటిపోయింది అనేది Point of Order క్రిందగాని, యింకోరకంగా కాని తీసుకురావడం సాధ్యం కాదని మనవి చేస్తున్నాను,

*Sri P Basi Reddi* Sir, I am appealing to the House to go back to the definition as contained in the original Bill, and I am appealing to the member in charge of the Bill to restore the original definition I think I am perfectly in order when I raise this as a point of Order and this is the appropriate time

**Sri K Brahmananda Reddi* Sir, I have to make one submission. We are passing a legislation and I feel, from the amendments moved, more consideration will have to be given to the amendments, and they cannot be automatically accepted at this stage It is not that I am opposing the amendments. When we are passing a very serious legislation practically affecting every family, I would suggest to the Chair, Sir, that this may be taken up at the next non-official day. Because, you will please see, Sir, the amendment moved by Sri P Sundarayya is a very important amendment, though he calls it as 'Explanation', it is no explanation, it is a kind of proviso to sub-clause (a) That is the crux of the matter 'Dowry' is defined in clause 3 (a) and the whole legislation depends on that Therefore, Sir, I would humbly suggest to the Chair, and to the House through you, Sir, that the amendments may be given better

thought and their consideration taken up at the next non official day. Rushing through this measure at this stage, without proper consideration, I may submit, Sir, would be very detrimental to the interests of the society whom we are trying to guard I would therefore suggest this for the consideration of the House

*Mr Deputy Speaker* Before the point of Order raised by Sri P Basi Reddi is dealt with, I want to know what the Leader of the Opposition has to say on this

*Sri A B Nageswara Rao (Rajahmundry)* Sir, the Bill has been considered and we are going through the second reading, i. e consideration of clauses At this stage, can we postpone discussion on clauses to another non-official day, because the motion for taking this into consideration has already been passed ?

*Mr Deputy Speaker* That is not the point before the House now First I am dealing with the point of Order raised by Sri P Basi Reddi

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, "ఇప్పుడు House ముందు ఉన్నటువంటి బిల్లు Select Committee లోని మొదటి ఉద్దేశం కంటె ఎక్కువ అయిపోయింది, కాబట్టి వరుడు యిచ్చేదానిని కూడా dowry క్రింద చేశారు. ఈ బిల్లు యొక్క scope పోయింది కాబట్టి ఈ difinition ను out of order క్రింద గాని, point of order క్రింద గాని, outside the scope" అని వారు objection raise చేస్తున్నారు వారి contention ను మనం అంగీకరిస్తే ఈ బిల్లుపై యింతవరకూ చర్చించినదంతా కూడా పోతుంది అందుచేత మనం చర్చించడానికి హక్కు లేదని వస్తుంది కాని Select Committee కి వెళ్లినప్పుడు dowry అనేది define చేయడంలో అన్ని రకాలుగా తీసుకోవాలనే ఉద్దేశంతో దానిని మార్చడం జరిగింది Select Committee report చాలా కాలం క్రిందటనే ప్రకటించింది తరువాత House ముందుకూడా చాలా కాలం ఉన్నది దానిపైన రెండురోజుల general discussion కూడా జరిగింది. ఈ బిల్లు scope అంతా మార్చేశారని నేను అనుకోవడంలేదు. కాని అట్లా మార్చేశారని వారు అనుకొన్నట్లయితే Select Committee నుంచి వచ్చి యిక్కడ ప్రవేశపెట్టినప్పుడే circulation కు పంపించాలనో, తిరిగి ఇంకొక Select Committee కి పంపించాలనో అభ్యంతరం raise చేయాలి కాని బిల్లుపై general discussion అంతా అయిపోయిన తరువాత 'Bill to be taken for consideration' అనేది కూడా pass అయిన తరువాత ఈ clause వల్ల ఈ బిల్లు scope పోతోంది అనే సమస్యే రాకూడదు. పాతబిల్లు శాసనసభ ముందు యిప్పుడు లేదు. Select Committee లో చర్చించి మన

ముందు పెట్టిన బిల్లు ఉన్నది కాని Select Committee కి పోకముందు వుంటె బిల్లు ఇక్కడ ఉండదు Public opinion ను దృష్టిలో పెట్టుకొని, Selec Committee లో చర్చించబడినబిల్లు ఈనాడు మనముందున్నది దీనిని యిప్పుడ మనం చర్చిస్తున్నాము ఇది consideration లోకి తీసుకోవాలి, మర House pass చేసిన తరువాత scope పోతోంది, కాబట్టి point of Order క్రింద తీసుక రావడానికి వీలులేదు కాబట్టి వారి point of Order నిలవదని నా ఉద్దేశ్యం

*Sri L Lakshmana Das* I agree with Sri P Sundarayya Therefore, we can proceed with the consideration of clauses

*Mr Deputy Speaker* I do not think there is any basic change in the definition of the original draft Bill and the amendment made by the Select Committee And I do not think there can be any point of law or point of order to be considered at this juncture Therefore, we shall proceed further.

Has the hon Leader of the Opposition got anything to say regarding the suggestion of Sri K Brahmananda Reddi to postpone further discussion to the next non-official day

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, ఈ బిల్లును త్వరగా pass చేయాలనే ఆదుర్దా అందరికీ ఉన్నది శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు తెచ్చిన point మొట్ట మొదట నేను చేసిన explanation ను కొంతవరకూ మార్పు చేస్తున్నదని నేను ఒప్పుకుంటాను కాని, అది explanation క్రిందవస్తున్నదా, proviso క్రింద వస్తున్నదా లేక definition ను యింకా కొంచెం enrich చేస్తున్నదా అనే controversy లోనికి పోకుండా కొంత మార్పు చేయాలనే ఉద్దేశం ఉన్నది అందుచేతనే amendment కూడా యివ్వడం జరిగింది దానిపైన మంత్రివర్గ లోంచి ఒక మంత్రిగారు లేచి చర్చించడం జరిగింది అది మంచిదే ఇది social legislation కు సంబంధించినది కాబట్టి యింకా సావకాశంగా ఆలోచిం చడం అవసరమే దానితోపాటు త్వరగా pass చేయాలనే ఆదుర్దా ఉన్నది ఇప్పటికే చాలా కాలం అయిపోయింది

ఇప్పుడు Business Advisory Committee లో వున్న Taxation Bills ను యితర బిల్లులనూ, 21 వ తేదీవరకూ తీసుకుంటాము అందుచేత 22 వ తేది non-official day గా declare చేసి ఆ నాడు ఈ బిల్లు pass అయ్యేటట్లుగా ప్రభుత్వం తరఫున ఎవరైనా చెపుతే అట్లా వాయిదా వేయడానికి మాకేమీ అభ్యంతరం ఉండదు 22 వ తారీఖున కాని లేకుంటే

సోమవారం నాడు వేసుకున్నాసరే, ఎపుడో ఒక పర్యాయం, రెగ్యులర్ సెషన్ కాకపోయినా మధ్యాహ్నం సెషన్ అయినా వేసి ఈ బిల్లును మాత్రం 22 వ తారీఖు లోపల పాస్ అయ్యేదానికోసం మంత్రివర్గం తరపున ఎవరైనా ఒప్పుకున్నట్లయితే ఎప్పటికి వాయిదా వేసినా నాకెటువంటి అభ్యంతరం లేదు

శ్రీ ఎల్ లక్ష్మణదాసు అధ్యక్షా, ఇప్పుడు బ్రహ్మానందరెడ్డిగారు చెప్పిన విషయంలో కొంత యదార్థం లేకపోలేదు మనం ఈ క్లాజ్‌ను—తీసుకొని వచ్చేటపుడు చాలా జాగ్రత్తగా చర్చించుకుంటూ వెళ్ళాలి "ఇది చాలా ప్రాక్టికబుల్‌గా వుండాలి, ఈ శాసనాన్ని అమలుపరచడానికికూడా వీలైనట్లుగా వుండాలని" చర్చించుకున్నాము ఇంకా దానికి further consideration వుండాలి దీనిని చాలా జాగ్రత్తగా చర్చించాలి అని ఈ విషయంలో వారు చెప్పిన దానితో నేను ఏకీభవిస్తున్నాను. అయితే, ఒక విషయం, ఈ బిల్లును మళ్ళీ వచ్చే సెషన్స్ వరకు పోకుండా ఈ సెషన్ పూర్తి అయ్యేలోగా, 25 వ తేదీలోగా, ఏదైనా ఒక తేదీని fix చేస్తే దీనిని అపుడు చర్చించుకొని వెంటనే తీసుకురావడానికి కొంత వ్యవధి అవసరమని మనం అందరమూ అనుకున్నాము. చాలామంది సభ్యులు ఈ రెండు రోజులలో చాలా సూచనలు చేశారు ఈ రెండు రోజులలో సభ్యులిచ్చిన సూచనలను బట్టే, బహుశః మన సుందరయ్యగారు ఈ ఏమెండ్‌మెంట్‌ను తీసుకువచ్చి వుంటారు తల్లితండ్రులు ఆడపిల్లలకు యిచ్చిన ఆస్థిని ఎందుకు వద్దనాలి? వాళ్ళేదో సంతోషంగా యిచ్చిన ఆస్తినికూడా మనం ఆటంక పరచాలా? అనే ఉద్దేశములు చాలామంది సభ్యులు తెలియపరచినందు వనే వారు ఈ సవరణను తీసుకువచ్చి వుంటారు అందుచేత ఈ legal points అన్ని చర్చించడానికి వ్యవధి యిస్తే దానికి నాకెటువంటి అభ్యంతరమూ లేదు. మన మంత్రిగారు హామీ యిచ్చినట్లు 20 వ తేదీ లోగానే ఏదో ఒక తేదీ దీనికి ప్రత్యేకిస్తే నాకెటువంటి అభ్యంతరమూ లేదు నేనుకూడా అంగీకరిస్తున్నాను.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి - అధ్యక్షా, సుందరయ్యగారు ఆ మాదిరిగా అంగీకరించడం చాలా సంతోషంగా ఉన్నది తమరు 22 వ తేదీన కాకుండా 20 వ తేదీననో 21వ తేదీననో మన అనుకూలం ప్రకారం ఒక సాయంత్రం దీనికి నిర్ణయిస్తే మాకేమీ అభ్యంతరం లేదు.

శ్రీ కె. విజయభాస్కరరెడ్డి (ఎమ్మిగనూరు - జనరల్) : మీరు ఆలోచించి చూసుకుని, మీ convenient time చూసుకొని fix చేసి House కు announce చేయవచ్చు. ఇపుడే చెప్పాలనేటటువంటి అవసరం లేదు.

*Mr Deputy Speaker* In view of the motion moved by Sri Brahmananda Reddi and also the views expressed by Sri P Sundarayya and Sri L Laxman Das, I think it would be better if further consideration of the Bill is postponed

*Sri A B Nageswara Rao* I rise on a point of Order, Sir,— whether the Billl could be postponed to another non-official day after it has been taken into consideration and discussed clause by clause today

*Mr Deputy speaker* If, for any reason, a Bill could not be considered, discussed and passed in one sitting the consideration may be continued on another day of the same session There is no hitch on this point, and the rules do not say that we cannot postpone consideration of the Bill to any date during the same session Therefore, I postpone further consideration of the Bill to the next non-official day, the date of which will be announced tomorrow or day after I believe it will be within a week or fortnight However, during this sitting itself, some time will be fixed for non-official business, when this Bill will be taken up for further consideration

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, దీని తరువాత యిపుడు ఈ రోజు ఎజెండాలో ఇంకొక రిజల్యూషన్ ఉంది దానిని యిపుడు move చేయ వచ్చుననుకుంటాను

*Mr. Deputy Speaker* Thinking that this Bill would take us till 1 O'clock today, I have allowed the hon Minister Sri M Narasinga Rao, to leave the House. Therefore, under these circumstances, I am not able to take up the next resolution

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య తమరు చెప్పినది మేము అంగీకరిస్తున్నాము. Resolution ను move చేద్దాము. రేపు procedure కు పోవచ్చును Discussion కు రేపు తీసుకుందాము అని మనవి. వారు ఇపుడు లేరు కనుక ఇపుడు resolution ను move చేద్దాము

*Sri K Brahmananda Reddi* · One suggestion, Sir. That resolution will come only after this Bill is passed, but not otherwise. Therefore, under extraordinary circumstances. . ..

శ్రీ పి. సుందరయ్య వావిలాల గోపాలకృష్ణయ్యగారు పెద్దగా insist చేయరనుకుంటాను నాకు రూల్స్ తెలిసున్నంతవరకు ఈ session continue అవుతున్నంత కాలము ఈ నాన్ అఫీషియల్ రిజల్యూషన్‌లు lapse కావు అందుచేత ఈ బిల్లు పూర్తిఅయిన తరువాత వెంటనే automatic గా Railway zone తీర్మానము వస్తుంది తరువాత బంచరాయి తీర్మానము వస్తుంది ఈ సెషన్‌ను ప్రోరోగ్ చేసిన తరువాత కొత్త రిజల్యూషన్స్ వస్తే వాటి కోసమే బ్యాలట్ తీసుకోవలసి వుంది. ఆ కారణముచేత ఇపుడు దానిని చర్చించడం లేదు అందుచేతనే వారు చెప్పినదానిని గురించి కూడా ఇపుడు చర్చించడం లేదు ఈ సిటింగ్‌లో తీసుకోకుండా దీనిని నెక్స్ట సిటింగ్‌లో తీసుకుంటే కొత్తగా రావలసి వస్తుందేమోనని, కొత్తబ్యాలట్ కూడా అవసరం ఉంటుందనే అభిప్రాయము గోపాలకృష్ణయ్యగారికి ఉంశ వచ్చు కాని దీనికిమాత్రం బాలెట్ లేదు కాబట్టి కంటిన్యూ అవుతుంది కొత్త రిజల్యూషన్ వస్తే ఆ కొత్త రిజల్యూషన్‌కు కొత్త బ్యాలట్ అవసరం ఉంటుంది కాని యీ సెషన్ ఉన్నంతవరకూ ఉన్నవాటికి మాత్రం యీ ఆర్డర్ వుంటూనే ఉంటుంది అందుచేత మనము ఫార్మల్‌గా దీనిని ఇపుడు మూవ్ చేయక పోయినా కూడా నెక్స్ట నాన్ అఫీషియల్ రోజున (యీ బిల్లుకోసం ప్రత్యే కంగా ప్రొవిజన్ చేస్తున్నామనుకోండి) యీ రైల్వే జోన్ రిజల్యూషన్ next resolution కాబట్టి అదే ఆటోమేటిక్‌గా వస్తుంది ఈ రూల్సు యొక్క అర్థం ఇది అని నేను అనుకుంటున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఇవే రూల్సు అయితే నాకేమీ అభ్యంతరం లేదు.

*Smt. Masuma Begum* On a point of information, Sir. The amendments that are received are usually taken up first, discussed and then either accepted or rejected by the House, and the Bill taken up for consideration clause by clause Is not the same procedure followed now also ?

*Mr. Deputy Speaker* Are you speaking about this Bill ?

*Smt Masuma Begum* Yes. We have passed 2 clauses of the Bill. We have other amendments which we have either to accept or reject, and then take up the Bill clause by clause.

*Mr Deputy Speaker* When there is a motion for adjournment, there is no question of considering the procedure you are

speaking of The clause by clause discussion of the Bill has been postponed

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్) ఇపుడు వావిలాల గోపాలకృష్ణయ్యగారి రిజల్యూషన్ వస్తే రూల్సుప్రకారము యీవేళ దానిని డిస్కషన్‌కు తీసుకోవడానికి వీలులేదు అనేది సరైనది అని నేను అనుకోవడం లేదు ఎందుకంటే మనం ఎజండాలో ఉన్న కార్యక్రమాన్ని కావాలని పోస్టుపోన్ చేసుకున్నాము ఈవేళ మనం దీనిని చర్చిస్తే కొన్ని ఇబ్బందులు వస్తాయనే ఉద్దేశంతో దీనిని పోస్టుపోన్ చేసుకున్నాము అంతేకాని, అందువల్ల తరువాత కార్యక్రమం ఏదైతే ఉందో అది, ఆటోమేటిక్‌గా ఆస్థానాన్ని ఆక్రమించుకోదు అనేసమస్య ఎపుడూ రాదని నేను అనుకుంటాను ఈ తీర్మానం ఇపుడు చర్చకురాదనే కారణంగా నరసింగరావుగారిని వెళ్ళమని చెప్పినాను, అందుకని అది ఇపుడువద్దని అన్నారు అంతేకాని రూల్సు అవకాశం ఇవ్వడంలేదు, మేము ఇలా చేస్తున్నామంటే అది ఆచారంక్రింద పడిపోయి మళ్ళీతేప (దఫా) కూడా ఇట్లానే వస్తుంది కాబట్టి రూల్సువిషయంలో మాత్రం...

డిప్యూటీ స్పీకర్ ఎవరన్నారు రూల్సు విషయంలో?

శ్రీ కె. యల్. నరసింహారావు బ్రహ్మానందరెడ్డిగారన్నారు

మిస్టర్ డిప్యూటీ స్పీకర్. బ్రహ్మానందరెడ్డిగారు లేక ఎవరేమన్నా అది మీకవసరం లేదు నేనేమన్నానో అదే మీరు గమనించవలసి ఉంటుంది ఇప్పుడు సభ రేపటిఉదయం 8-30 గంటలదాకా వాయిదా వేయబడ్డది

*The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the 12th November, 1957*